# స్టాక్ మార్కెట్

## ఒక అవగాహన




పి. సురేంద్ర గౌడ్

**STOCK MARKET**
by P. Surendra Goud

First Edition : August 2009



# షేర్లు అంటే ఏమిటి?

మనం మన భవిష్యత్తులో అభివృద్ధి చెందాలని అనుకుంటాము. అందుకు ఏదో ఒక వ్యాపారం చేయాలి. దానికి పెట్టుబడి కావాలి. ఒక చిన్న సైజు వ్యాపారమయితే తక్కువ పెట్టుబడి చాలు. అదే వ్యాపారం భారీ ఎత్తున చేయాలనుకుంటే మాత్రం ఎక్కువ పెట్టుబడి తప్పనిసరిగా కావాలి.

ఏదయినా ఒక కంపెనీ ప్రారంభించాలంటే కోట్ల రూపాయలు పెట్టుబడి కావాలి. సర్వసాధారణంగా ఒక కంపెనీ ప్రారంభించాలని అనుకున్నవారికి కనీసం పది కోట్ల రూపాయలు అవసరం అవుతుంది.

ఆ పైకాన్ని వారికి జాతీయ బ్యాంకుగాని - ఫైనాన్స్ కంపెనీగాని కొంతమేరకే ఋణాల్ని మంజూరు చేస్తాయి. దానికి కూడా బోలెడు రూల్స్, రెగ్యులేషన్స్ వుంటాయి. కాళ్లరిగేలా ఒకటికి పదిసార్లు వారి చుట్టూ తిరిగితే రకరకాల ష్యూరిటీలు అడుగుతారు. వ్యాపారపరంగా యక్షప్రశ్నలు వేసి చివరకు ఓ నాలుగు కోట్ల రూపాయలు మాత్రమే మంజూరు చేస్తాయి.

అయితే యీ పైకంతో వ్యాపారం ప్రారంభించటం కష్టం. మరో ఆరు కోట్లు వుంటే గాని అనుకున్న వ్యాపారం సజావుగా సాగదు.

మొత్తం ఒకే వ్యక్తి పదికోట్లు పెట్టుబడి పెట్టగలిగితే ఆ వ్యాపారం నిరాటంకంగా కొనసాగుతుంది. ఒకవేళ అంత మొత్తం లేనివారు మిగిలిన పైకానికి భాగస్వాములను వెతుకుతారు. అదీ కుదరని పక్షంలో షేర్సు ఆఫర్ చేస్తారు.

భాగస్వాముల పెట్టుబడి నాలుగు కోట్లు అనుకుందాం.

ఫైనాన్స్ కంపెనీ నాలుగు కోట్లు యిచ్చింది. యింకా మిగిలిన రెండు కోట్ల రూపాయలకు షేర్సు ఆఫర్ చేస్తారు. మిగిలిన పైకం రెండు కోట్ల రూపాయలు కాబట్టి 20% మాత్రమే లాభాలు యిస్తారు. ఆ పర్సంటేజ్ ఎవరు ఎంతవరకు షేర్స్ తీసుకుంటే అంతవరకే లాభాలు యిస్తారు.

ఈ లాభాలనేవి నికరంగా వుండవు. కంపెనీ నడవడికను బట్టి లాభాలు వస్తాయి. ఈ షేర్సను యూనిట్లు అంటారు. మొత్తం సమకూరాక కంపెనీ ప్రారంభమవుతుంది.

కొన్ని కంపెనీలు అతి త్వరితగతిన లాభాలు తెచ్చిపెడతాయి. మరికొన్ని కంపెనీలు ఆలస్యంగా లాభాలను తెచ్చిపెడతాయి.

కంపెనీలను బట్టి లాభ, నష్టాలు వుంటాయి.

సర్వసాధారణంగా సంవత్సరానికి ఏ కంపెనీ వాళ్లయినా ఒకసారి జమ ఖర్చులు చూసుకుంటారు.

బ్యాంకు పైకం, వాటాదారులకు పైకం అన్నీ యిచ్చి పన్నులు తీసేసి నికర లాభం తేలుస్తారు. కంపెనీ షేర్సు ఏ పర్సంటేజ్‌లో వుందో పేపర్‌లో ప్రకటిస్తారు.

మామూలుగా ఒక షేరు ధర పది రూపాయలుగా నిర్ణయిస్తారు. మనం వందల సంఖ్యలో షేర్లు కొనాలి. పది రూపాయలకు ఎంత షేరు వస్తుందో అంతే ప్రకటిస్తారు. దాన్ని మనం ఎంత లాభంలో వున్నామో మనం తెలుసుకోవచ్చు.

ఒకవేళ మన అంచనా ప్రకారం లాభాలు తక్కువనిపిస్తే అమ్మేసుకోవచ్చు. మళ్లీ ఎప్పుడు కావాలంటే అప్పుడు కొనుక్కోవచ్చు.

**షేర్లు తీసుకున్నందువల్ల లాభం ఏమిటి?**

షేర్లు తీసుకున్నందువల్ల లాభాలూ వున్నాయి; నష్టాలూ వున్నాయి.

ఒక వేళ నష్టం అనిపిస్తే మనం అమ్మేసుకోవచ్చు, లేదా ఒకరి నుంచి మరొకరికి మార్పిడి చేసుకోవచ్చు.

ఇలా మనం తీసుకున్న షేర్స్ కంపెనీ లాభాలు ఆశిస్తుందని చెప్పలేం. ఎంతో పెద్ద పేరున్న కంపెనీ షేర్లు అంత త్వరగా దొరకవు. పైగా ప్రతిరోజూ షేర్సులో మార్పులు జరుగుతూ వుంటాయి. మనం కొన్న షేర్లు యొక్క ధరలు నికరంగా వుండవు. కొన్ని





విపరీతంగా పెరిగిపోతాయి. మరికొన్ని భయంకరంగా పడిపోతాయి. అందుకనే చాలామంది షేర్ మార్కెట్‌లోకి రావటానికి జంకుతున్నారు. కొన్ని పెద్ద పెద్ద కంపెనీలు డివిడెండ్‌లను ఆఫర్ చేస్తున్నాయి. యిలా డివిడెండ్‌ల ఆఫర్‌వల్ల కొంతమంది షేర్స్ కొనటానికి ఎంతో ఉత్సాహం చూపిస్తున్నారు.

షేర్స్ మనం ఎప్పుడు వద్దనుకుంటే అప్పుడు వెంటనే వాటిని అమ్మి కాష్ చేసుకోవచ్చు. మరో వ్యాపారానికి ఇటువంటి సౌకర్యం లేదు.

మన దగ్గర పైకం సరిపడా లేకపోయినా - మన వద్ద వున్న మేరకే షేర్స్ కొనుగోలు చేయవచ్చు.

షేర్స్‌లో ఎంత లాభం వచ్చినా ఆ మొత్తానికి పన్ను కట్టనవసరం లేదు.

కొన్ని కంపెనీలలో షేర్స్ తీసుకుంటే అవి నష్టం అనిపిస్తే వెంటనే అమ్మేయవచ్చు. ఆ రోజే పైకం చేతికి అందుతుంది. మిగతా ఏ వ్యాపారం చేసినా అంత త్వరగా పైకం చేతికి రాదు.

పైగా అమ్మటం - కొనటం వల్ల కూడా కొంత లాభం వుంటుంది.

మనం షేర్స్ కొనేముందు చుట్టూ పరిసరాలు గమనించాలి. ఏ కంపెనీ ఎంత లాభాలను చూపిస్తుంది. ఏ కంపెనీ అభివృద్ధి పథంలో నడుస్తుంది అనేది గమనించాలి. అందులో వున్న సాధక బాధకాలు తెలుసుకుంటే మనకు నష్టం రాకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

**బ్రోకర్‌తో ఇబ్బందులు**

సర్వసాధారణంగా చాలామందికి షేర్స్ తీసుకోవాలనిపిస్తుంది. అయితే ఎవరిని కలవాలి? ఎలా తీసుకోవాలి? ఎక్కడ తీసుకోవాలి? అనే విషయాలు తెలియదు. ఇటువంటి వారు బ్రోకరును ఆశ్రయిస్తారు. కంపెనీకి - షేర్స్ తీసుకునేవారికి మధ్య వారధిలా పనిచేస్తాడు బ్రోకరు. బ్రోకరు కొన్ని వివరాలు చెబుతాడు.

దాంతో నమ్మకం కలుగుతుంది. వెంటనే యూనిట్లు తీసుకుంటాడు. బ్రోకర్ చెప్పే మాటలకు ఇన్వెస్టర్ దాసోహం అయిపోతాడు. దాంతో ఆ బలహీనతను బ్రోకర్ కాష్ చేసుకుంటాడు. పెట్టుబడిదారుడు కొన్ని ఇబ్బందులు ఎదుర్కోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.



బ్రోకర్‌కు ఎక్కువ కమీషన్ వచ్చే కంపెనీల షేర్స్ ఇప్పిస్తాడు. ఇతని అమాయకత్వం ఆసరా చేసుకుని నకిలీ సర్టిఫికెట్లు యిస్తాడు. ఆ సర్టిఫికెట్‌ను అతను చాలా భద్రంగా దాచుకుంటారు. పాపం అతనికి యింకా ఏవో బోనస్‌లు - డివిడెండ్‌లు కూడా వస్తాయని నమ్మబలుకుతాడు. అవన్నీ వినటానికి బాగానే వుంటాయి. కాని ఫలితం మాత్రం శూన్యం.

పెట్టుబడిదారుడు బ్రోకర్ చేతిలో పడితే తెలివిగలవాడయితే ఫరవాలేదు. బయటపడతాడు. [illegible]ంట అతని పని ఖాళీ. మోసపోవటం తప్ప వేరే గత్యంతరం లేదు.

కాబట్టి బ్రోకర్‌ని కలిసే ముందు అందరినీ విచారించి మంచి బ్రోకర్‌ని ఎంపిక చేసుకోవటం అవసరం. షేర్స్ తీసుకునేవారు స్టాక్ ఎక్సేంజ్‌లో వున్న నియమనిబంధనలన్నీ తెలుసుకోవటం చాలా అవసరం. అలా చేయటం వల్ల బ్రోకర్ల ఆటలు సాగవు. బ్రోకర్ లేకుండా వుండాలంటే ఏం చేయాలో పరిశీలిద్దాం.



# స్టాక్‌మార్కెట్ వివరాలు

మనం నిత్యావసర సరుకులు పచారీ షాపుల్లో కొంటున్నట్టే షేర్లు కొనుగోలు చేయడానికి - అక్కరలేకపోతే అమ్మడానికి స్టాక్ ఎక్సేంజ్ అనే పేరుతో ఒక సంస్థ వుంది.

ఇందులో అన్నీ షేర్లూ లభించవు. కొన్ని పరిమితమయిన కంపెనీల షేర్సు మాత్రమే లభిస్తాయి. ఇక్కడ వ్యవహారం తమాషాగా వుంటుంది. కొందరు అమ్మటానికి వస్తారు. కొందరు కొనటానికి వస్తారు. షేర్ల రేటును బట్టి అమ్మకాలు - కొనుగోలు జరుగుతుంది. ఇందులో బ్రోకర్స్ కొంత మార్జిన్ తీసుకుంటారు.

బ్రోకర్స్ ద్వారా కార్యకలాపాలు జరిగినా అవి స్టాక్ ఎక్ఛేంజ్‌లోనే లావాదేవీలు జరగాలి. స్టాక్ ఎక్ఛేంజ్‌లో లావాదేవీలు జరిపితే ఇన్వెస్టర్లు నష్టపోకుండా వుండాలని ప్రభుత్వం కొన్ని సూచనలు చేసి తగు చర్యలు తీసుకుంటుంది.

ఈ స్టాక్ ఎక్ఛేంజ్‌లు సర్వసాధారణంగా ఉదయం పది గంటలకు మొదలుపెట్టిన లావాదేవీలు సాయంకాలం నాలుగు గంటలవరకే వుంటుంది. ఈ మధ్యకాలంలోనే మన వ్యాపార లావాదేవీలు చూసుకోవాలి. శని, ఆదివారాలు సెలవు దినాలుగా ప్రకటించారు. మనం షేర్స్ కొనే ముందు కంపెనీ స్టాండర్డు తెలుసుకోవాలి. 1956 చట్టం క్రిందకు స్టాక్ ఎక్ఛేంజ్‌లు వస్తాయి. వాటిల్లోనే మనం షేర్స్ తీసుకోవాలి. కొందరు సభ్యులు అనధికారంగా స్టాక్ మార్కెట్‌ని ఏర్పాటు చేసి లావాదేవీలు జరుపుతారు. అవి 1956 చట్టం పరిధిలోకిరావు. కాబట్టి అన్నీ వివరంగా తెలుసుకుని షేర్సు తీసుకోవటం ఎంతో మంచిది.

**ఎటువంటివారు షేర్స్ కొనటం మంచిది**

మనం రంగారావు షేర్స్ కొని ఆ వచ్చే లాభాలతో మూడు అంతస్థుల భవనం కట్టాడు. యీ వార్త ప్రచారమయింది. అంతే తెలుసు మనకు. దీని వెనుక రంగారావు కృషి ఎంత? శ్రమ ఎంత? పెట్టుబడి ఎంత? ఇవన్నీ మనం ఆలోచించటం లేదు.

ఆయన భవంతి కట్టాడు. మనం కట్టాలి. అంతవరకే ఆలోచిస్తాం.

షేర్ మార్కెట్‌లో షేర్స్ కొనటం అనేది కష్టంతో కూడుకున్న పని.

జీవన పోరాటంలో సతమతమవుతున్న వారు షేర్లు కొనటం సబబు కాదు. కోరికలు లేని మానవులు వుండరు.

అలాగని కోరి రిస్కులు తెచ్చుకోకూడదు. ప్రతి వ్యక్తికి కొన్ని బాధ్యతలుంటాయి. ముందు వాటి నుంచి బయటపడి రిలాక్సయి తరువాత షేర్స్ గురించి ఆలోచించాలి.

మీరు వ్యాపారస్తులనుకోండి వ్యాపారంలో వచ్చే లాభాలను కొంత ఇంటికి వెచ్చించి - మిగిలితే షేర్స్ గురించి ఆలోచించాలి.

డబ్బు అవసరం లేని మానవులు ఎవరూ వుండరు. యీ నెల అవసరం లేని డబ్బు వచ్చే నెల అకస్మాత్తుగా అవసరం రావచ్చు. కనుక కొంత పైకం దాచుకోవటం కూడా అవసరమే.

మీరు ఏదైనా జాబ్ చేస్తున్నారనుకోండి. మీ ఆదాయం ఎంత? మీ ఖర్చు ఎంత? భవిష్యత్తులో మీకెం ఖర్చులు వుంటాయి అనేది మీరు బేరీజు వేసుకోండి. ఫరవాలేదు. యీ నెల ఇబ్బందిపడ్డా వచ్చే నెలలో సర్దుకోగలం అనే ధైర్యం మీలో వుంటే నిరభ్యంతరంగా మీరు షేర్స్ కొనవచ్చు.

షేర్స్ కొనే ముందు బాగా ఆలోచించి నిర్ణయం తీసుకోండి. మీరు ఆస్థిమంతులనుకోండి హాయిగా షేర్స్ కొనవచ్చు. లాభం వచ్చినా నష్టం వచ్చినా పెద్ద ఇబ్బంది వుండదు. నిర్భయంగా కొనవచ్చు, అమ్ముకోవచ్చు.

మీరు ఒక లారీని అమ్మారు. మళ్లీ వెంటనే మరో లారీ కొన్నారు. మీకు లాభం వచ్చి వుంటుంది. ఆ లాభాన్ని షేర్స్ కొనటానికి వినియోగించండి. ఇందులో కూడా లాభాలు రావచ్చు. రెండు ఆదాయాలతో మీరు భవిష్యత్తులో ఉన్నత శిఖరాలను అధిరోహించవచ్చు. ఒక విధంగా దీన్ని వ్యాపారంగా చేయాలి తప్ప - వ్యసనంగా మారకూడదు.

## స్టాక్ ఎక్ఛేంజ్‌లు ఎక్కడున్నాయి?

స్టాక్ ఎక్ఛేంజ్‌లు షేర్స్ అమ్మడం - కొనటం చేస్తాయి. యిటువంటి కార్యకలాపాలు జరిపే స్టాక్ ఎక్ఛేంజ్‌లు ఎక్కడున్నామో పరిశీలిద్దాం.

ఢిల్లీ - హైదరాబాద్ - మద్రాసు - అహ్మదాబాద్‌లలో స్టాక్ ఎక్ఛేంజ్‌లు వున్నాయి. ఒకప్పుడు హైదరాబాద్ స్టాక్ ఎక్ఛేంజ్ విపరీతమైన రేంజ్‌లో వుండేది. ప్రస్తుతం



చాలా దీన స్థితిలో వుంది. బాగా తగ్గిపోయింది. ఇది వరకున్న జోరు యిప్పుడు కనుపించటం లేదు. లాభాలు తక్కువగల కంపెనీలు కూడా షేర్స్ ఆఫర్ చేసినందువల్ల కొన్ని స్టాక్ ఎక్ఛేంజ్‌లు కూడా మూతపడ్డాయి.

ప్రస్తుతం ప్రధాన పాత్ర వహిస్తున్నది నేషనల్ స్టాక్ ఎక్ఛేంజ్‌లే. ఇవి దేశమంతా విస్తరించి ప్రజలకు ఎన్నో సేవలను అందిస్తున్నాయి.

కావున ఎవరైనా షేర్స్ కొనాలనే ఆసక్తి వున్నవారు నేషనల్ స్టాక్ ఎక్ఛేంజ్ ద్వారా కార్యక్రమాలు జరపటం మంచిది.

## ఎటువంటి షేర్లను ఎన్నుకోవాలి?

వినియోగ, మౌలిక సదుపాయాలు, ఆఫ్ షోరింగ్ రంగాల్లో వృద్ధికి అవకాశాలు ఉన్నందువల్ల యంత్రపరికరాలు, ఇంజనీరింగ్, విద్యుత్తు, బ్యాంకింగ్ నిర్మాణ రంగాలకు చెందిన కంపెనీల షేర్లు పెట్టుబడికి అనుకూలంగా వుంటాయని పరిశీలకులు భావిస్తున్నారు.

పెట్రో రసాయనాలు, ఐటీ, యుటిలిటీ రంగాలలోని కంపెనీల షేర్లకు వారు అండర్‌వెయిట్ ప్రాధాన్యం యిస్తున్నారు. మార్కెట్లో దిద్దుబాటు (కరక్షన్) చోటు చేసుకున్నప్పటికీ సెన్సెక్స్ 15,000 స్థాయిలో పీ/ఈ నిష్పత్తి 21గా వుంది. ఈ పరిస్థితిలో ఇన్వెస్టర్లు పెట్టుబడులను కొనసాగించవచ్చు. కానీ స్వల్పకాలిక ట్రేడింగ్ ప్రమాదకరమే. ఫార్మా, ఎఫ్ఎమ్‌సీజీ కంపెనీల షేర్లలో పెట్టుబడి పెట్టటం ద్వారా రిస్క్ తగ్గించుకోవచ్చునని చెబుతున్నారు.

చాలామంది రకరకాల కంపెనీ షేర్స్ కొంటూ వుంటారు. వారు ఏ కంపెనీవి కొన్నారో - ఆ కంపెనీ ఏ వస్తువులను తయారు చేస్తుందో వారికి తెలియనే తెలియదు. వారు కొన్న కంపెనీ పేరు చెబుతారు ఎవరో చెప్పారు కదా అని షేర్లు కొంటారు.

మొట్టమొదటిగా మనం షేర్సు కొనే ముందు దేశ, విదేశాల్లో పరిణామాలు ఎలా వున్నాయో తెలుసుకోవాలి. ఎందుకంటే విదేశాల్లో ఎలాంటి ప్రమాదం సంభవించినా ఆ ప్రభావం స్టాక్ మార్కెట్ మీద పడుతుంది. యీ విషయాల్ని పేపరు ద్వారా మనం తెలుసుకోవాలి. అక్కడ వాతావరణం అనుకూలంగా వుంటే స్టాక్ మార్కెట్ కూడా ప్రశాంతంగా వుంటుంది.

అలానే పంటలు కూడ సమృద్ధిగా పండితేనే స్టాక్‌మార్కెట్ అనుకూలంగా వుంటుంది. రైతులు బాగుంటే అన్ని రంగాలలో ప్రజలు సుఖ సంతోషాలతో వుంటారు. అప్పుడు స్టాక్ మార్కెట్ కూడా కళకళ లాడుతూ వుంటుంది.

టెక్స్‌టైల్ కంపెనీలకు మిషనరీని అమ్మే యీ కంపెనీ అద్భుతంగా పనిచేస్తుంది. యీ కంపెనీ చేతిలో విపరీతమైన ఆర్డర్సు వున్నాయి. యీ కంపెనీ డివిడెండ్ ప్రకటించే అవకాశం వుందని పరిశీలకులు భావిస్తున్నారు. కాబట్టి యిటువంటి కంపెనీ షేర్స్ నిరభ్యంతరంగా తీసుకోవచ్చు.

హెూటల్ వ్యాపారాలు బాగానే వున్నాయి. హెూటల్‌కు వచ్చే వారి కస్టమర్ల ఆదరణతో రోజుకురోజు తారాపథాన్ని అందుకుంటున్నాయి. యిటువంటి షేరు ఎంతో అభివృద్ధిని సాధించగలదని మార్కెట్ పరిశీలకులు తెలియపరుస్తున్నారు.

ఫార్మారంగం కూడా మంచి అభివృద్ధిలో వుంది. భారతదేశంలోనే కాక ప్రపంచమంతా వ్యాప్తి చెందుతోంది. యీ కంపెనీలు హడావిడి లేకుండా తాబేలు నడక నడుస్తోంది. అయినా ముందు ముందు భవిష్యత్తులో షేర్ మూడు వంతులు పెరగగలదని మార్కెట్ పరిశీలకులు చెబుతున్నారు.

స్టీలు రంగం కూడా ముందంజలో వుంది. స్టీలు రంగం కూడా మంచి ఫలితాలను సాధిస్తున్నది. ప్రస్తుతం త్వరితగతిన పెరుగుతున్నది యీ రంగం. అతి త్వరలో ఇవి మెగా కంపెనీలుగా వెలవగలవని తెలుస్తున్నది. బ్యాంకుల రంగం కూడా మెరుపు వేగంతో ప్రయాణం చేస్తున్నది.



# డబ్బులు పోయినా మనమే మిన్న ప్రపంచ మార్కెట్లను తలదన్నిన సెన్సెక్స్

దలాల్ స్ట్రీట్ పేరు ఇప్పుడు విదేశీ మార్కెట్లలో మార్మోగుతోంది. సర్వసాధారణంగా అంతర్జాతీయ మార్కెట్లనే సరికి డోజోన్స్, నాస్‌డాక్, నిక్కీ వంటి పదాలే ఇన్వెస్టర్ల నోళ్లపై నానుతూ వుంటాయి. ఇప్పుడు వాటి సరసన సెన్సెక్స్ కూడా చేరింది. ఇందుకు కారణం లేకపోలేదు. నవంబర్ 2007న ప్రపంచవ్యాప్తంగా అధిక శాతం స్టాక్ మార్కెట్లు ఇన్వెస్టర్లకు నష్టాలనే మిగిల్చాయి. వాటికి మన మార్కెట్లూ మినహాయింపు కాదు.... అయితేనేం ఇతర మార్కెట్లతో పోలిస్తే ఇన్వెస్టర్లకు తక్కువ నష్టం వచ్చింది ఒక్క మన మార్కెట్‌లోనే.

భారత్ స్టాక్ మార్కెట్ మదుపర్లు నవంబర్ 2007వ నెలలో ఇప్పటిదాకా దాదాపు రూ. 40,000 మొత్తాన్ని పోగొట్టుకుని వుండొచ్చని అంచనా. అయినప్పటికీ ఇన్వెస్టర్లకు మంచి రాబడిని తెచ్చిపెట్టడంలో అమెరికా తదితర అంతర్జాతీయ స్టాక్ మార్కెట్‌లతో పోల్చుకుంటే ఇప్పటికీ బీఎస్ఈనే ముందు వరుసలో వుంది. 'సెన్సెక్స్' నవంబరులో ఇప్పటివరకూ నికరంగా సుమారు 600 పాయింట్ల (2.97 శాతం) నష్టాన్ని చవి చూసింది. ఇన్వెస్టర్ల మొత్తం సంపద (లిస్టెడ్ కంపెనీల సంచిత మార్కెట్ క్యాపిటలైజేషన్ ఆధారంగా లెక్కించినపుడు) 1,60,300 కోట్ల డాలర్ల నుంచి 1,59,100 కోట్ల డాలర్లకు పడిపోయింది. ఇదే సమయంలో అమెరికాలోని 'డోజోన్స్ సూచీ' 8 శాతం మేరకు నష్టపోయింది. దీంతో పోల్చుకుంటే సెన్సెక్స్ నష్టం సగం కంటే తక్కువ. ఇక ఐరోపా, ఆసియా, తదితర ప్రపంచ ఈక్విటీ మార్కెట్లు సైతం సగటున ఏడు శాతానికి పైగా నష్టాలను చవిచూశాయి.



అంతర్జాతీయ స్టాక్ మార్కెట్ల ఈక్విటీ సూచీల గణంకాలను అందించే 'డోజోన్స్ ఇండెక్సెస్ అండ్ స్టాక్స్ లిమిటెడ్ అందించిన గణాంకాలను అందించే 'డోజోన్స్ ఇండెక్సెస్ అండ్ స్టాక్స్ లిమిటెడ్ అందించిన గణాంకాల ప్రకారం అక్టోబరు 1-26 మధ్య డోజోన్స్ సూచీ 8.52 శాతం ఐరోపా మార్కెట్ 7.38 శాతం, ఆసియా మార్కెట్ 7.07 శాతం ఇతర ప్రపంచ మార్కెట్లు 7.42 శాతం చొప్పున నష్టపోయాయి.

నవంబరులో నమోదైన అంతర్జాతీయ ప్రామాణిక సూచీల నష్టాలతో పోల్చుకుంటే సెన్సెక్స్ నష్టం సగం కూడా లేదు. పైగా ఏడాది కాలంగా వీటితో పోలిస్తే సెన్సెక్స్ లాభాలు భారీగా వున్నాయి. ఏడాది ఆరంభం నుంచి చూసినప్పుడు డోజోన్స్ గ్లోబల్ టైటాన్స్-50 వరల్డ్ వైడ్ బ్లూచిప్ సూచీ 0.79 శాతం చొప్పున పెరగగా, సెన్సెక్స్ జనవరి-అక్టోబరు 26 మధ్య 38 శాతం పెరగడం విశేషం. ఏడాది మొదట్లో 80,000 కోట్ల డాలర్లుగా వున్న భారత మార్కెట్ మదుపర్ల సంపద దాదాపు రెట్టింపయింది.





# 'ఫ్యూచర్స్'లో అగ్రస్థానం ఎన్ఎస్ఈదే

స్టాక్ ఫ్యూచర్స్ ట్రేడింగ్‌లో నేషనల్ స్టాక్ ఎక్స్ఛేంజీ (ఎన్ఎస్ఈ) ప్రపంచంలోనే అగ్రస్థానానికి చేరింది. ఇప్పటిదాకా నెంబర్‌వన్‌గా వున్న జోహన్నెస్‌బర్గ్ స్టాక్ ఎక్స్ఛేంజీ (జేఎస్ఈ. దక్షిణాఫ్రికా)ని వెనక్కి నెట్టింది. స్టాక్ ఎక్స్ఛేంజీల ప్రపంచ సమాఖ్య విడుదల చేసిన తాజా గణాంకాల ప్రకారం గత అక్టోబరులో ఎన్ఎస్ఈలో 2.40 కోట్ల స్టాక్ ఫ్యూచర్స్ కాంట్రాక్టులు ట్రేడ్‌కాగా, జేఎస్ఈలో 83.67 లక్షలు మాత్రమే ట్రేడయ్యాయి.

- ఏటా ప్రకటించే 'ఫిన్‌టెక్-100' జాబితాలో ఇన్ఫోసిస్ వరుసగా నాలుగో సంవత్సరం చోటు సంపాదించింది. ప్రపంచ వ్యాప్తంగా తొలి 100 అప్లికేషన్, సేవల సరఫరాదారులను గుర్తించే యీ జాబితాలో ఇన్ఫోసిస్ 18 నుంచి 14వ స్థానానికి ఎగబాకింది.
- బెంగుళూరుకు చెందిన డాటాటాక్ సర్వీసెస్‌లో 74 శాతం వాటాను వేల్యూమార్ట్ ఇన్ఫో టెక్నాలజీస్ కొనుగోలు చేసింది. డాటా టాక్‌కు ఎయిర్‌టెల్, క్లబ్ మహీంద్రా, డాయిష్ బ్యాంక్, నెస్లే, పెప్సి, టిక్‌ట్రానిక్స్ జీ టెలివిజన్ లాంటి క్లయింట్లు వున్నాయి.
- ఎస్సార్ ఆయిల్, బొంగైగావ్ రిఫైనరీ, టాటా టెలీ (మహారాష్ట్ర) జీవీహైడ్రో, రిలయన్స్, పెట్రోలియం, ఎన్ఐఐటి టెక్నాలజీస్, ఐఎఫ్‌సీఐ, యాడ్‌ల్యాబ్స్ ఫిల్మ్‌ల ఫ్యూచర్స్ ట్రేడింగ్ అసాధారణ స్థాయి (95 శాతానికి పైగా)లో జరగడంతో ఎన్ఎస్ఈ ఈ నిర్ణయం తీసుకుంది.
- బ్రిజ్ బినానీ గ్రూపునకు చెందిన బినానీ సిమెంట్స్ వచ్చే నాలుగేళ్లలో రూ. 1800 కోట్ల అంచనా వ్యయంతో ఉత్పత్తి సామర్థ్యాన్ని 0.3 మిలియన్ టన్నుల నుంచి 2.2 మిలియన్ టన్నులకు పెంచనుంది.
- డింపుల్స్ సినీ అడ్వర్టయిట్‌మెంట్‌లో 51 శాతం వాటాను పిరమిడ్ సాయి మీరా థియేటర్ బయటకు వెల్లడించని మొత్తానికి కొనుగోలు చేసింది.
- రిజర్వు బ్యాంకు సమాచారం ప్రకారం సెప్టెంబరులో విదేశీ రుణాలు, మార్పిడి బాండ్ల ద్వారా టాటా స్టీల్ 875 మిలియన్ డాలర్లు (రూ. 3500 కోట్లు) రిలయన్స్ కమ్యూనికేషన్స్ 500 మిలియన్ డాలర్ల (రూ. 2000 కోట్లు) మేర నిధులు సమీకరించాయి.

# ఈ షేర్లను ఒక చూపు చూడండి

మార్కెట్ హెచ్చుతగ్గుల మధ్య ఊగిసలాడుతోంది. పడినా పెరిగినా మార్కెట్ శైలే వేరుగా వుంటోంది. సాధారణంగా సెన్సెక్స్ జోరు ప్రధాన షేర్లకే పరిమితమయ్యేది.

ఈ మధ్య కాలంలో తీరు మారింది. ఇన్వెస్టర్లు చిన్న మధ్య స్థాయి (స్మాల్, మిడ్ క్యాప్) షేర్లపై దృష్టి సారించటం మొదలెట్టారు. యీ నేపథ్యంలో ఉత్సాహిక మదుపర్లు అనుసరించాల్సిన పద్ధతులపై పరిశీలకుల సూచనలివి.

రహదారులు, విమానాశ్రయాలు రేవుల వంటి మౌలిక ప్రాజెక్టులపై కేంద్రం కనబరుస్తున్న శ్రద్ధాసక్తులు సిమెంట్, నిర్మాణ ఇంజనీరింగ్ కంపెనీల పని తీరుకు దన్నుగా నిలుస్తున్నాయి. టెలికామ్ రంగమూ జోరు మీదే వుంది. నిర్మాణ రంగంలో పంజ్‌లాయిడ్, నాగార్జునా, ఐవీఆర్‌సీ ఎల్ ఇన్‌ఫ్రా, టెలికాంలో భారతీ ఎయిర్‌టెల్, ఆర్‌కామ్, సిమెంట్ రంగంలో గ్రాసిమ్, ఏసీసీ, ఇంజినీరింగ్ కంపెనీల్లో బెల్, ఎల్ & టీ థెర్మాక్స్ తదితర కంపెనీలు సెప్టెంబరు 2007తో ముగిసిన త్రైమాసికంలో మంచి ఫలితాలు సాధించాయి. మరో ప్రక్క ముడి చమురు ధరలు, రూపాయి, వడ్డీ రేట్ల వంటి ప్రతికూలతల నడుమ ఇంజినీరింగ్ యంత్ర పరికరాలు విద్యుత్తు, విద్యుదుత్పత్తికి దోహదపడే ఉపకరణాల తయారీ ఫైనాన్షియల్ సేవలు, నిర్మాణం వంటి రంగాల్లో మంచి పనితీరు కనబరుస్తున్న కొన్ని కంపెనీల షేర్లు పెట్టుబడులకు అనువైనవని నిపుణులు చెబుతున్నారు.

స్క్రిప్ విలువ దిగజారిన పక్షంలో మౌలిక వసతుల కల్పన దాంతో పెనవేసుకున్న కంపెనీలపై దృష్టి పెట్టవచ్చున్నది వారి సూచన. భారీ స్థాయి (లార్జ్ క్యాప్) కంపెనీలతో పోలిస్తే మధ్యస్థాయి (మిడ్ క్యాప్) కంపెనీల షేర్లలో లావాదేవీల వల్ల నష్ట భయం పరిమితంగా వుండగలదన్నది వారి అభిప్రాయం. వీరు సూచిస్తున్న కొన్ని షేర్లు పరిశీలిద్దాం.



# ఐపీఓల్లో చిన్న మదుపర్లకు 10 శాతం డిస్కౌంట్ సెబీ పచ్చజెండా

తొలి పబ్లిక్ ఆఫర్ (ఐపీఓ)ల వైపు మరింత మంది ప్రజలను ఆకర్షించేందుకు రంగం సిద్ధం అయింది. ఇకపై కంపెనీలు ఫాస్ట్ ట్రాక్ రూట్లో అంటే ఐపీఓలు చేసేటప్పుడు కూడా షేర్లను పది శాతం వరకు డిస్కౌంటుతో చిల్లర మదుపుదారులకు (రిటైల్ ఇన్వెస్టర్లకు) ఇవ్వజూపవచ్చు. అంటూ సెక్యూరిటీస్ ఎక్స్ఛేంజ్ బోర్డ్ ఆఫ్ ఇండియా (సెబీ) అనుమతి ఇచ్చింది. (ఇంతవరకు ఫాలో - ఆన్ పబ్లిక్ ఆఫర్ (ఎఫ్‌పీఓ)లకు మాత్రమే, ఈ డిస్కౌంట్ వెసులుబాటు వుంది.) అలాగే అన్ని షేర్ దరఖాస్తుల్లో శాశ్వత ఖాతా సంఖ్య (పీఏఎన్-పాన్)ను వెల్లడించటం తప్పనిసరి అని సెబీ ఒక పత్రికా ప్రకటనలో పేర్కొంది.

ఇంతవరకు ఈ విషయంలో రూ. 50,000 అంతకన్నా ఎక్కువ అనే పరిమితి వుండేది. ఎవరిని రిటైల్ ఇన్వెస్టర్‌గా పరిగణించాలో కూడా సెబీ కొత్త మార్గదర్శక సూత్రాల్లో స్పష్టం చేసింది. రూ. లక్షకు మించని విలువ మేరకు బిడ్‌లు సమర్పించే వ్యక్తులను రిటైల్ ఇన్వెస్టరుగా ఎంచాలని పేర్కొంది. ఇప్పటివరకు ఈ కేటగిరీకి రూ. 50,000 గరిష్ట పరిమితిగా భావిస్తూ వచ్చారు. కార్పొరేట్ సంస్థలు రైట్స్ ఇష్యూలను ఫాలో-ఆన్ పబ్లిక్ ఆఫర్లకు వెళ్లేటందుకు అనుసరించవలసిన నిర్దేశిత నియమాలను కూడా సెబీ తన ప్రకటనలో తెలియజేసింది.

కనీస మార్కెట్ విలువ - స్టాక్ ఎక్స్ఛేంజ్‌ల్లో ట్రేడింగ్ టర్నోవర్ లిస్టింగ్‌కు సంబంధించిన రికార్డు, మదుపుదారు ఫిర్యాదుల పరిష్కార విభాగం నిర్వహణ వంటివి ఇందులో వున్నాయి.

ఇంతకాలం ఐపీఓలకు మొత్తం మీద మదుపరుల గిరాకీ బాగానే వుంటున్నా విదేశీ సంస్థాగత మదుపుదారులు (ఎఫ్ఐఐ) అధిక, నికర విలువ వున్న వ్యక్తులు, మ్యూచువల్ ఫండ్‌ల వంటి పెద్దస్థాయి సంస్థాగత మదుపరుల వాటాయే ఎక్కువగా వుంటోంది.

చిన్న మదుపరులకు పెద్ద పాత్ర వుండటం లేదు. డీఎల్ఎఫ్ లిమిటెడ్ ఆ మధ్య రూ. 9000 కోట్లను కేపిటల్ మార్కెట్ నుంచి సేకరించగా ఆ ఇష్యూ సుమారు నాలుగింతలు అధిక ప్రతిస్పందనకు నోచుకుంది. ఇందులో రిటైల్ ఇన్వెస్టర్లకు ప్రత్యేకించిన భాగానికి బుక్-బిల్డింగ్ ప్రక్రియలో 97.5 శాతం సబ్‌స్క్రిప్షన్ మాత్రమే అందింది.

ముంద్రా పోర్ట్, ఎస్ఈజడ్ ఐపీఓ సైతం మొత్తం మీద 116 రెట్లు సబ్‌స్క్రైబ్ కాగా అందులో రిటైల్ ఇన్వెస్టర్ల భాగం 16 రెట్లు మాత్రమే వుంది. సెబీ చర్య స్వాగతించేదిగా వుందని ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకర్ హర్షించారు.



# 'వంద'షేర్ల ఫండు

స్వల్ప ఆటుపోట్లు ఎదుర్కొంటున్నా స్టాక్ మార్కెట్ జోరుగానే సాగిపోతున్నది. నష్ట భయం వెంటాడుతున్న చాలామందిని మార్కెట్ దరిదాపుల్లోకి అడుగుపెట్టకుండా చేస్తోంది. మరి ఇలాంటప్పుడు ఏం చేయాలి? అనే ప్రశ్న చాలామందిలో ఉదయిస్తోంది.

దీనికి జవాబుగా అన్నట్లు షేర్లలో పొందే లాభాలను కూడా అందించేందుకు వీలుగా ఫండ్ కంపెనీలు కొత్త కొత్త పథకాలను ప్రవేశపెడుతున్నాయి.

ఇదే కోవలో ఎల్ఐసీ మ్యూచువల్ ఫండ్ తన కొత్త పథకాన్ని ప్రవేశపెట్టింది. అదే ఎల్ఐసీ ఎంఎఫ్ 'టాప్ 100 ఫండ్' మూడేళ్ల క్లోజ్ ఎండెడ్ ఫండ్ ఇది.

ఆ తర్వాత ఓపెన్ ఎండెడ్‌గా మారిపోతుంది. మార్కెట్లో దీర్ఘకాలిక పెట్టుబడుల ద్వారా మంచి లాభాలు వస్తాయనేది తెలిసిన విషయమే కదా! మూడేళ్లపాటు యూనిట్లు అమ్మడానికి అవకాశం లేదు. కాబట్టి దీర్ఘకాలిక దృష్టితో మార్కెట్లో పెట్టుబడి పెట్టే వారికి అనుకూలంగా వుంటుంది.

సీఎన్ఎక్స్ 100 ఇండెక్స్ షేర్లలో ఈ ఫండ్ పెట్టుబడి పెడుతుంది. కొనుగోలు అమ్మకం రుసుములు లేవు. అయితే 36 నెలల తరువాత యూనిట్లను అమ్మడానికి మాత్రమే ఎగ్జిట్‌లోడ్ వుండదు. అంతకు ముందు అమ్మితే మాత్రం రుసుము భరించాల్సిందే. ఫండ్‌లో కనీసపెట్టుబడి రూ. 5 వేలు. ఆ తర్వాత రూపాయి నుంచి ఎంతైనా పెట్టవచ్చు. మన వీలును బట్టి గ్రోత్ డివిడెండ్‌లను ఎంచుకోవచ్చు. ఫండ్ ప్రారంభ ఎన్ఏవీ రూ. 10 ప్రతి బుధవారం ఎన్ఏవీ ప్రకటిస్తారు. ఆ రోజు సెలవు వస్తే మర్నాడు ప్రకటిస్తారు.

మదుపుదారులు వారానికోసారి సొమ్ము తీసుకోవటానికి వెసులుబాటు వుంటుంది. క్లోజ్ ఎండెడ్ వ్యవధి ముగిసిన తర్వాత ఎప్పుడైనా అమ్ముకోవడానికి వీలు వుంటుంది.

సమీకరించిన మొత్తం పెట్టుబడిలో 80 శాతం వరకూ ఈక్విటీల్లో పెట్టుబడి పెడతారు. మిగతా 20 శాతం డెట్.మనీ మార్కెట్లో పెడతారు. అంటే నష్ట భయం అంతగా ఉండదన్నమాట.

సీఎన్‌ఎక్స్‌లో మిడ్‌క్యాప్, స్మాల్‌క్యాప్, లార్జ్‌క్యాప్ కంపెనీలు అన్నీ వున్నాయి. ప్రస్తుతం ఎక్కువ లాభాలను ఆర్జిస్తున్న రంగాలన్నీ కూడా ఇందులో వున్నాయి. ఆటో, బ్యాంకింగ్, ఫైనాన్షియల్ సర్వీసెస్, సిమెంట్, పవర్, మెటల్ ఫార్మా, ఐటీ టెలికాం, కన్‌స్ట్రక్షన్, ఎఫ్‌ఎంసీజీ, క్యాపిటల్ గూడ్స్, ఫోర్జింగ్ హోటల్, ఆయిల్, గ్యాస్ పెట్రో కెమికల్ రిఫైనరీస్ టెక్స్‌టైల్స్ తదితర రంగాల షేర్లు ఇందులో వున్నాయి. ఇవన్నీ కూడా ప్రస్తుత ఆర్థిక వ్యవస్థలో కీలక పాత్ర పోషిస్తున్నాయి. భవిష్యత్తంగా కూడా ఈ రంగాలపై ఆధారపడి వున్నదే. కాబట్టి వీటిలో పెట్టుబడి పెట్టి లాభాలు ఆర్జించడానికి వీలుంది. అయితే సిస్టమేటిక్ ఇన్వెస్ట్‌మెంట్ ప్లాన్ (ఎస్ఐపీ) లేకపోవడం ప్రతికూలాంశంగా చెప్పుకోవచ్చు.

**దీర్ఘకాలం మంచిది**

మార్కెట్ ఒడిదుడుకులను తట్టుకుని, లాభాలను ఆర్జించడం చిన్న మదుపు దారులకు అంత సులభం కాదు. అలాంటి వారికి కూడా లాభాలను అందించేందుకు ఉద్దేశించిందే ఈ ఫండ్ ఇండెక్స్ షేర్లలో పెట్టుబడి పెట్టినంత మాత్రాన ఇది ఇండెక్స్ ఫండ్ కాదు. కొన్నేళ్ల మార్కెట్ చరిత్రను గమనిస్తే దీర్ఘకాలంలో పెట్టుబడి పెట్టినవారికి లాభాలు ఎక్కువగా వచ్చాయనే నిజం మనకు తెలుస్తుంది. అందుకే మాటాప్ 100 ఫండ్ పెట్టుబడుల్లో కనీసం మూడేళ్లపాటు కదల్చకుండా వుండేలా చూస్తున్నాం అన్నారు ఫండ్ మేనేజర్ బిచిత్రా మహాపాత్ర.

**షేర్లు ఎలా కొనాలి?**

మీరు ఏదైనా ఒక షేరు కొనాలనుకున్నారు. తాము తీసుకున్న షేర్ కంపెనీ తీరుతెన్నులు ఎలా వున్నాయో తెలుసుకోవాలంటే ఏం చేయాలి? పూర్తి వివరాలు ఏమిటో తెలుసుకుందాం.

ముందుగా మీరు మార్కెట్లో లభిస్తున్న వ్యాపార పత్రికలు, మాగజైన్లను అధ్యయనం చేయండి. స్టాక్ ఎక్స్ఛేంజ్ వెబ్‌సైట్లు నుంచి మీకు కావలసిన సమాచారం లభిస్తుంది. మార్కెట్ రెగ్యులేటర్ సెబీ వెబ్‌సైట్ లో మీకు అవసరమైన కంపెనీల సమాచారాన్ని అధ్యయనం చేస్తూ కంపెనీల పనితీరుపై మార్కెట్ నడవడికపై కొంత అవగాహన పొందవచ్చు.



ప్రస్తుతం మార్కెట్ ఒడిదుడుకులను ఎదుర్కొంటున్నది కదా! రాబోయే రోజుల్లో పరిస్థితి ఎలా వుంటుందో కూడా తెలియదు. దీర్ఘకాలికంగా మదుపు చేయాలనుకుంటున్న వాళ్లు ఏ ఏ రంగాల షేర్లను ఎంచుకుంటే రాబడి గరిష్టంగా వుంటుందో వివరంగా తెలుసుకుందాం.

స్వల్పకాలంలో వివిధ అంశాలు మార్కెట్‌ను నిలువరించే అవకాశం వుంది. దీర్ఘకాలానికి మదుపు చేస్తే మార్కెట్ గమనం ఆశాజనకంగానే వుండవచ్చు. మీరు మదుపు చేసే మొత్తాన్ని డైవర్సీ ఫైడ్‌గా చేసుకోవటం మంచిది. అంటే మొత్తాన్ని ఒకేసారి పెట్టుబడి పెట్టకుండా మార్కెట్ పడిపోయినప్పుడల్లా కొద్ది కొద్ది మొత్తాలను మదుపు చేయటం తెలివైన పని. రానున్న రెండు మూడేళ్ల కాలానికి పవర్, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్, కన్‌స్ట్రక్షన్, బ్యాంకింగ్, క్యాపిటల్ గూడ్స్ తదితర రంగాల భవిష్యత్తు ఆశాజనకంగా ఉండటానికి అవకాశం వుండవచ్చు.

కొందరు మిగులు మొత్తాన్ని కొన్ని మంచి షేర్లలో పెట్టుబడి పెట్టాలనుకుంటున్నారు. మూడేళ్ల వరకు వేచి వుందామనుకుంటారు. ఇవి 20 నుంచి 30 శాతం రాబడిని ఇస్తుందా మీరు అనుమాన పడుతున్నారు కదూ. అదెలాగో తెలుసుకుందాం.

మిగులు మొత్తాన్ని షేర్లలో పెట్టాలనే నిర్ణయం నష్ట భయంతో కూడుకున్న పని. మీరు దాన్ని భరించగలిగేటట్లయితే తప్పకుండా మంచి షేర్లలో నేరుగాగానీ, లేదా మ్యూచువల్ ఫండ్ల ద్వారాగానీ దీర్ఘకాలానికి మదుపు చేయవచ్చు. గత మూడు దశాబ్దాలుగా చూసినట్టయితే ఈక్విటీ ఇండెక్స్‌లో వున్న షేర్లు సుమారు 20 శాతం చొప్పున వృద్ధిని అందించాయి. ఇకముందు కూడా దీర్ఘకాలానికైతే ఇదే వృద్ధి రేటు వచ్చే అవకాశాలు వున్నాయి.

మేము షేర్లలో పెట్టుబడి పెట్టాలని అనుకుంటారు. ఎవరిని సంప్రదించాలి? మొదటిసారిగా ఎంత మదుపు చేస్తే మంచిది. మా సొమ్మును ఎప్పుడు కావాలంటే అప్పుడు తీసుకోవచ్చా అనే అనుమానం చాలామందికి వుంది. వారి అనుమానాలను నివృత్తి చేసుకుందాం.

షేర్లలో పెట్టుబడి పెట్టాలనే ముందు మీరు డిపాజిటరీ ఖాతాను తెరవాలి. బ్యాంకు లేదా స్టాక్ బ్రోకర్ల వద్ద ఈ ఖాతాను తెరవవచ్చు. మంచి పబ్లిక్ ఇష్యూ

వచ్చినప్పుడు రిటైల్ సెగ్మెంట్‌లో దరఖాస్తు చేసినట్టయితే కొన్ని షేర్లు మీకు కేటాయించే అవకాశం వుంది. ఈ విషయంలో మీ దగ్గరలో వున్న స్టాక్‌బ్రోకర్‌ని సంప్రదించండి. ప్రైమరీ మార్కెట్‌లో కొంత అనుభవం వచ్చాక సెకండరీ మార్కెట్లో మదుపు ప్రారంభించవచ్చు. ఎంత పెట్టుబడి పెట్టాలనేది మీ ఆర్థిక స్థితిగతులను బట్టి మీరే నిర్ణయించుకోండి. అనుభవం వచ్చే వరకూ తక్కువ డబ్బుతోనే మదుపు చేయటం మంచిది. షేర్లలో మీ పెట్టుబడిని ఎప్పుడు కావాలంటే అప్పుడు అమ్మి సొమ్ము చేసుకోవచ్చు, అమ్మినరోజు నుంచి మూడు రోజుల్లోనే డబ్బు మీకు అందుతుంది.

షేర్లను మార్కెట్‌లో ఎలా ట్రేడ్ చేస్తారు? ఏ ప్రాతిపదికన షేర్ల ధరలు ఎక్కువ, తక్కువలు అవుతాయో తెలుసుకుందాం.

ఈ రోజు మన స్టాక్ మార్కెట్‌లో రమారమి వంద శాతం వ్యాపారం ఆన్‌లైన్ ట్రేడింగ్ ద్వారా జరుగుతుంది. స్టాక్ ఎక్ఛేంజ్ గుర్తింపు పొందిన బ్రోకర్లు వీటిని నిర్వహిస్తారు. వి-శాట్ మరికొన్ని మార్గాల ద్వారా కూడా ఈ వ్యాపారం జరుగుతున్నది. ఎక్కడివారు అక్కడ వుండి ఈ విధానంలో వ్యాపారాన్ని నిర్వహించుకోవచ్చు. ఇంటర్‌నెట్ ద్వారా కూడా నిర్వహించుకోవచ్చు. స్టాక్ ఎక్ఛేంజ్‌ను షేర్ల క్రయవిక్రయాల ప్రాంతంగా పరిగణిస్తారు. ఎక్ఛేంజ్‌కి మదుపర్లకి మధ్యవర్తిగా బ్రోకర్ పనిచేస్తారు. మిగిలిన మార్కెట్ల వలె గిరాకీ - సరఫరాలే షేర్ల ధరలను నిర్ణయిస్తాయి. దీన్ని ప్రభావితం చేసే అంశాలు అనేకం వుంటాయి.



# కనిపెట్టి లాభం పొందుదాం

ఏడాది కాలంలో ఎన్నో కొత్త కంపెనీలు స్టాక్ మార్కెట్లో లిస్ట్ అయ్యాయి. రానున్న రోజుల్లో అత్యుత్తమ కంపెనీలు కూడా మూలధన సేకరణ కోసం ప్రజల ముందుకు రానున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో మనం నేరుగా వాటాలు చేజిక్కించుకోవాలంటే ఎలాంటి వ్యూహాలు పన్నాలో తెలుసుకుందాం.

ఈ రోజున స్టాక్ మార్కెట్ ఎన్నో ఒడుదుడుకులను ఎదుర్కొంటున్నది. కొత్తగా మార్కెట్‌లోకి ప్రవేశించే వారికి సెకండరీ మార్కెట్‌లో షేర్ల ధరలు అందుబాటులో లేకుండా పోయాయి. ఒక్కోరోజు నాలుగు శాతం పైగా పెరిగిన సందర్భమూ వుంది. అంతే వేగంగా పడిపోయిన పరిస్థితీ చూస్తున్నాం. ఈ ఆటుపోట్లతో చిన్న మదుపరులు స్టాక్ మార్కెట్ అంటేనే భయపడే స్థితికి చేరుకున్నారు. సరిగ్గా ఇలాంటి సమయాల్లోనే ప్రైమరీ మార్కెట్‌లో షేర్లను కొనడం మంచిది.

### వివరంగా తెలుసుకుందాం

ఐపీఓకి వచ్చిన ప్రతి కంపెనీలోనూ మనం పెట్టుబడి పెట్టలేం కదా! ముందుగా మంచి నమ్మకమైన కంపెనీని ఎన్నుకోవాలి. కంపెనీలు సెబీకి సమర్పించే 'ఆఫర్ డాక్యుమెంట్'ను చదివి అర్థం చేసుకోవాలి. పత్రికల్లోనూ, ఇంటర్నెట్‌లోనూ వచ్చే విశ్లేషణలు చదవాలి. కంపెనీ ఏ రంగానికి చెందినది? దాని భవిష్యత్తు ఎలా వుండబోతోంది తదితర వివరాలను ఆరా తీయాలి. అప్పుడే కచ్చితమైన నిర్ణయానికి రాగలుగుతాము.

### వేలం పాడదాం

వాటాల కేటాయింపులో కంపెనీలు రెండు పద్ధతులను పాటిస్తాయి. సాధారణ పద్ధతిలో కేటాయించడం మొదటి పద్ధతి. ఇందులో షేర్ల ధర ముందే నిర్ణయిస్తారు. అప్పుడు దరఖాస్తుతో పాటు మనకు కావాల్సిన షేర్లకు సరిపడా మొత్తానికి చెక్కు లేదా డీడీ ఇస్తే సరిపోతుంది.

ప్రస్తుతం ఎక్కువగా వాడుతున్న విధానం బుక్ బిల్డింగ్. ఒక విధంగా ఇది వేలం పాట లాంటిదన్నమాట. ఇందులో కనిష్ట ధర (ఫ్లోర్‌ప్రైస్) గరిష్టధర (సీలింగ్

ప్రైస్)లను కంపెనీ నిర్ణయిస్తుంది. ఇందులో మీకు ఇష్టం వున్న ధరకు బ్రోకర్ల ద్వారా మీరు బిడ్లు సమర్పించవచ్చు.

### చిన్న మదుపరులకు సూచన

లక్ష రూపాయలకంటే తక్కువ మొత్తాన్ని పెట్టుబడిపెట్టే వారిని చిన్న మదుపరులు (రిటైల్ ఇన్వెస్టర్)గా పేర్కొంటారు. ప్రతి ఇష్యూలో కూడా దీనికోసం 30 నుంచి 35 శాతం వరకూ ప్రత్యేకిస్తారు. దరఖాస్తులు ఎంత ఎక్కువగా వచ్చినా అదే పద్ధతి అవలంభిస్తారు. అందుకే దరఖాస్తు చేసినన్ని షేర్లు మనకు లభించవు. ఇటీవలే ఇష్యూకి వచ్చిన ముద్రాపోర్టును గమనిస్తే లక్ష రూపాయల లోపు దరఖాస్తు చేసిన వారికి సుమారు 15 షేర్లు వచ్చాయి. కోటి రూపాయలు పెట్టిన వారికి కూడా 150కి మించి రాలేదు.

- ఒక మంచి కంపెనీ ఇష్యూకు వచ్చింది. వీలైనన్ని ఎక్కువ వాటాలు కొనాలని నిర్ణయించుకున్నారనుకుందాం. అలాంటప్పుడు మీరు ఒక్కరే కాకుండా మీ కుటుంబ సభ్యుల పేర్ల మీద కూడా దరఖాస్తు చేయటం మంచిది.

### కటాఫ్ ధర

వాటాలకు దరఖాస్తు చేసుకునే చిన్న మదుపరులకు ఒక మంచి అవకాశం వుంటుంది. అదే 'కటాఫ్ ధర'కు షేర్ల కేటాయింప. ఇష్యూ ముగిసిన తర్వాత షేర్ల కేటాయింపునకు నిర్ధారించే ధరనే 'కటాఫ్ ప్రైస్' అంటారు. మామూలుగా బుక్ బిల్డింగ్ పద్ధతిలో మనం బిడ్డింగ్ వేయాల్సి వుంటుందని అనుకున్నాం కదా! ఏ ధరకు వేయాలో మనం ఒక నిర్ణయానికి రాలేకపోతున్నప్పుడు ఇది మేలు. ఇక్కడ గుర్తుంచుకోవలసిన అంశం ఏమిటంటే... కటాఫ్ ప్రైస్‌కు దరఖాస్తు చేసినప్పటికీ చెక్కు/డీడీ మాత్రం గరిష్ఠ ధరకే ఇవ్వాలి.



## దరఖాస్తు పూర్తి చేసేటప్పుడు యీ సూచనలు తప్పనిసరిగా గమనించాలి

దరఖాస్తు పూర్తి చేసే విషయంలో ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. దరఖాస్తులో డీమ్యాట్ ఖాతా వివరాలు పేర్కొనటం తప్పనిసరి. ఇందులో తేడాలు వుంటే ఇబ్బందులు తప్పవు. ఉమ్మడి డీమ్యాట్ ఖాతా వున్నవాళ్లు ఖాతాలో పేర్కొన్న వరసనే దరఖాస్తులో కూడా రాయాల్సి వుంటుంది. డిపాజిటరీ పార్టిసిపెంట్, బెనిఫిషియరీ ఐడీ నెంబర్లు తప్పులు, కొట్టివేతలు లేకుండా స్పష్టంగా వుండాలి. దగ్గరలో వున్న బ్రోకరు దగ్గరకు వెళ్లి, దరఖాస్తు ఎలా నింపాలి. చెక్కు ఎలా నింపాలి అనేది జాగ్రత్తగా అడిగి తెలుసుకోవాలి.

- డీమ్యాట్ ఖాతా వివరాల్లో తేడా వస్తే మీకు కేటాయించిన షేర్లను మీ ఖాతాలోకి బదిలీ చేయరు. సరైన వివరాలు అందిస్తేనే మీకు వాటాలు అందుతాయి.
- షేర్లు కేటాయించని సందర్భాల్లో మీకు రిఫండ్ పంపిస్తారు. మీరు డీమ్యాట్ ఖాతా తెరచినప్పుడు అక్కడ అందించిన వివరాలనే రిఫండ్ కోసం కూడా పరిగణనలోకి తీసుకుంటున్నారు. అంటే పబ్లిక్ ఇష్యూలో షేర్లకు దరఖాస్తు చేసుకున్నప్పుడు కాదు. డీమ్యాట్ ఖాతా తెరుస్తున్నప్పుడు కూడా తప్పులు లేకుండా చూసుకోవాలి.
- మీరిచ్చే/చెక్కు/డీడీ వెనుక భాగంలో మీ పేరు దరఖాస్తు సంఖ్య రాయటం ఎట్టి పరిస్థితుల్లోనూ మరచిపోవద్దు.
- దరఖాస్తులోని అన్ని వివరాలనూ సక్రమంగా పేర్కొంటేనే మీకు ఎలాంటి ఇబ్బందీ లేకుండా షేర్లు వస్తాయి. అన్నీ సవ్యంగా వుంటే ఇష్యూ తేదీ తర్వాత మూడు వారాల్లో మీ డీమ్యాట్ ఖాతాలో షేర్లు జమ అవుతాయి. మిగిలిన మొత్తానికి రిఫండ్ రాకపోతే మీ దరఖాస్తు వివరాలతోపాటు, బ్యాంకు ఖాతా వివరాలను జత చేసి రిజిస్ట్రార్‌ను సంప్రదించాలి.
- మీకు షేర్లూ రాక... రిఫండూ రాకపోయినా పూర్తి వివరాలను కంపెనీ రిజిస్ట్రార్‌ను సంప్రదించి సమస్యను పరిష్కరించుకోవచ్చు.

- కొన్ని సందర్భాల్లో కంపెనీలు సరైన వివరాలు ఇవ్వవు. అలాంటప్పుడు వాటిల్లో పెట్టుబడి పెట్టిన వారిని తమ పెట్టుబడులను ఉపసంహరించుకోవాల్సిందిగా సెబీ సూచిస్తుంటుంది. కాబట్టి ఐపీఓల్లో పెట్టుబడి పెట్టడమే కాదు. లిస్టింగ్ అయ్యే వరకూ దానిని గమనిస్తూ వుండాలి.
- దరఖాస్తు సమర్పించినప్పుడు కౌంటర్‌ఫాయిల్ తీసుకోవడం మర్చిపోవద్దు. రిఫండ్ రాకపోతే ఇదే మనకు ఆధారం.
- ఐపీఓల్లో వచ్చిన షేర్లన్నీ మంచి ఫలితాలను సాధిస్తాయని అనుకోలేం. అందుకే మనం షేర్లను కొనేప్పుడే దీర్ఘకాలమా? స్వల్పకాలమా? అనేది నిర్ణయించుకోవాలి. పరిస్థితులను బట్టి ఆయా రంగాలకు భవిష్యత్తు ఎలా ఉంటుందనే దాన్ని బట్టి ఇది నిర్ణయించుకోవాలి.



# లక్ష్మీ కటాక్షం

పందెం గుర్రంలా పరుగు తీస్తున్న స్టాక్ మార్కెట్‌లో అంబానీ సోదరులు తమ మదుపుదారులపై కాసుల వర్షం కురిపిస్తున్నారు ముకేశ్. అనిల్ అంబానీల ఆధ్వర్యంలో వున్న రిలయన్స్ కంపెనీల్లో మదుపు చేసిన ఇన్వెస్టర్ల సంపద రూ. నాలుగు లక్షల కోట్ల మేరకు వృద్ధి చెందటం ఇందుకు ప్రబల నిదర్శనం.

ప్రస్తుత ఆర్థిక సంవత్సరం ప్రారంభం నుంచి ఇప్పటి దాకా భారతీయ కంపెనీల మొత్తం మార్కెట్ క్యాపిటలైజేషన్ రూ.20 లక్షల కోట్ల మేరకు పెరిగింది. దీనిలో 20 శాతం (రూ. 4 లక్షల కోట్లు సంపద అంబానీల కంపెనీలదే. కొన్ని ఇతర అంశాలను పరిశీలిద్దాం.

- ముకేశ్ అంబానీ గ్రూప్ కంపెనీల మార్కెట్ క్యాపిటలైజేషన్ అత్యధికంగా రూ. 2.5 లక్షల కోట్ల మేరకు వృద్ధి చెందింది.
- తరువాతి స్థానాల్లో అనిల్‌కు చెందిన అడాగ్ (రూ. 1.5 లక్షల కోట్లు) కె.పి. సింగ్- డి.ఎల్.ఎఫ్. (రూ. 1.5 లక్షల కోట్లు) సునీల్ మిట్టల్ నిర్వహణలోని భారతీ ఎయిర్‌టెల్ (రూ. 75 వేల కోట్లు) వున్నాయి.
- నవ కుబేరుల జాబితాలో ప్రస్తుతం అయిదో స్థానంలో వున్న అజీమ్ ప్రేమ్‌జీ నేతృత్వంలోని విప్రో మార్కెట్ క్యాపిటలైజేషన్ మాత్రం రూ. 3,800 కోట్ల మేర క్షీణించింది.
- 2007 ప్రారంభం నుంచి ఇప్పటి దాకా సెన్సెక్స్ 45 శాతం వృద్ధి చెంది దాదాపు 6,000 పాయింట్లు లాభపడింది. మొత్తం ఇన్వెస్టర్ల సంపద రూ. 58 లక్షల కోట్లను అధిక మించింది.
- దేశంలో అత్యంత విలువైన సంస్థలుగా రిలయన్స్ ఇండస్ట్రీస్, ఆర్‌కామ్ భారతీ ఎయిర్‌టెల్, డీఎల్‌ఎఫ్, ఐసీఐసీఐ బ్యాంక్, ఓ.ఎన్.జీ.సీ, ఎన్‌టీపీసీ, భెల్ గుర్తింపు పొందాయి. ఇవి దాదాపు రూ. 9 లక్షల కోట్ల సంపదను మదుపుదారులకు అందించాయి. వీటి మార్కెట్ క్యాపిటలైజేషన్ రెట్టింపైంది.

- స్వతంత్ర కంపెనీల పరంగా చూస్తే రిలయన్స్ ఇండస్ట్రీస్ రూ. 1.9 లక్షల కోట్లు, ఆర్‌కామ్, భారతీ ఎయిర్‌టెల్‌లు రూ. 70,000 - 75,000 కోట్లు ఆర్.పి.ఎల్. రూ. 50 వేల కోట్లు, రిలయన్స్ క్యాపిటల్, రిలయన్స్ ఎనర్జీలు రూ. 30 వేల కోట్లు చొప్పున మార్కెట్ క్యాపిటలైజేషన్‌ను పెంచుకున్నాయి.

**బుర్ర వేడెక్కుతున్న చిన్న మదుపరి**

దూసుకుపోతున్న సెన్సెక్స్ కొందరు బడా ఇన్వెస్టర్లకు కాసుల పంట పండిస్తోంటే ఈ తరుణంలో చిన్న మదుపర్లు (రిటైల్ ఇన్వెస్టర్లు) ఎలాంటి భూమికను పోషించాలనే అంశంపై మిశ్రమ భాష్యాలు వెలువడుతున్నాయి. సెన్సెక్స్ పోకడ భయం గొలిపే విధంగా వుందని అంటున్నారు. దీని దూకుడు విడ్డారంగానూ - విపరీతంగానూ వుందని మరికొందరు బుగ్గలు నొక్కుకుంటున్నారు. మరి మదుపర్లు వారివద్ద వున్న షేర్లను అలాగే అట్టేపెట్టుకుని... మరింత ఎక్కువ లాభాల కోసం ఎదురు చూడాలా? లేక మంచి తరుణం మించిన దొరకదు, ఆలస్యం చేస్తే ఆశాభంగం తప్పదు అనుకుంటూ బరిలోకి గెంతి సొమ్ము చేసేసుకోవాలా?



ఇవి ప్రశ్నలుగానే వుండిపోయాయి.

అయితే యీ ప్రశ్నలకు కొందరు నిపుణులు కొన్ని సూచనలు యిచ్చారు. అవేమిటో తెలుసుకుందాం!

- ఆకర్షణీయంగా కనిపిస్తున్న షేర్లను వెతికి వాటిని అమ్మేసి లాభాలు స్వీకరించాలి.
- మరికొన్నింటిని మీ వద్దే ఉంచుకోవాలి.
- ఏ షేరును ఎప్పుడు వదులుకునేదీ వున్న పళాన చెప్పమంటే అది సాధ్యం కాదు.
- సమయానుకూలంగా - సందర్భాన్ని బట్టి మార్పులు చేర్పులు మన నిర్ణయం చేస్తుంది.



- అంతేకాదు, 25 సెషన్‌లలోపే మార్కెట్ 2,000 పాయింట్లు పెరిగిందీ అంటే ఆచి తూచి వ్యవహరించాలి.
- నష్టపోతామనే భయం ఉండనే ఉండదని కరాఖండీగా ఎవరూ చెప్పలేరు.
- దానిని వీలయినంత తగ్గించుకునే ఉపాయాలు ఆలోచించుకోవాలి.
- మ్యూచువల్ ఫండ్‌ల వైపు వెళ్లటం ఒక మార్గంగా పెట్టుకోవచ్చు.
- ఫండ్ నిర్వాహక సంస్థలూ ఈ విషయాన్ని గ్రహించి రెండు నెలలకో సారి గోల్డ్ ఫండ్ అనీ, విదేశీ సెక్యూరిటీస్ ట్రేడ్ ఫండ్ అనీ, ఎనర్జీ ఫండ్ అనీ... రకరకాల పేర్లతో స్కీములు ప్రారంభిస్తున్నాయి.

ఇవన్నీ చిన్న మదుపరిని, గందరగోళపరిచే అంశాలే. తన చేతిలోని స్క్రిప్‌లు అమ్మాలా? అట్టేపెట్టుకోవాలా? వేచి చూడాలా..? ఇప్పటికీ ఏదీ తేల్చుకోలేని స్థితి అతనిది.

**స్టాక్ మార్కెట్లోకి 10% పీఎఫ్ నిధులు ఆర్థిక శాఖ నిర్ణయం**

స్టాక్ మార్కెట్‌ను భవిష్య నిధులు (పీఎఫ్) ముంచెత్తే అవకాశం వుంది. ఇప్పటి దాకా అయిదుశాతం పీఎఫ్ నిధులను స్టాక్‌మార్కెట్లో నమోదిత కంపెనీల్లో పెట్టుబడి పెట్టేందుకు అనుమతించే విషయంపై కేంద్ర ఆర్థిక శాఖ నిర్ణయం తీసుకునే అవకాశం వుంది. ప్రభుత్వేతర భవిష్య నిధుల పెట్టుబడి తీరుకు సంబంధించి ఇప్పటికే ప్రజాభిప్రాయాన్ని కోరామని వాటిని అధ్యయనం చేసిన తర్వాత ఒక నిర్ణయం తీసుకోగలమని ఆర్థిక శాఖ సీనియర్ అధికారి ఒకరు ఇక్కడ తెలిపారు. ఈ మార్గదర్శకాలను ప్రైవేట్ ప్రావిడెంట్ ఫండ్‌లు అనుసరిస్తే స్టాక్ మార్కెట్లోకి తరలి వచ్చే పెట్టుబడి సుమారు రూ. 3 లక్షల కోట్ల వరకు వుంటుంది. తద్వారా ఉద్యోగులు తమ పొదుపు మొత్తాలపై అధిక రాబడిని పొందేందుకు అవకాశం వుంటుంది. ప్రస్తుతం ఈ నిధులపై 8.5 శాతం వడ్డీని చెల్లిస్తున్నాయి. స్టాక్ మార్కెట్లు ఇటీవలి కాలంలో 25-40 శాతం దాకా రాబడిని ఇచ్చిన విషయం తెలిసిందే.

# వ్యాపార విశ్వాసం తగ్గుతోంది
## కార్పొరేట్ల పై సర్వేలో వెల్లడి

భారతీయ కంపెనీల్లో వ్యాపార విశ్వాసం సూచీ అయిదేళ్ల కనిష్ట స్థాయికి పడిపోయింది. రూపాయి దృఢత్వంతో దిగజారిన ఎగుమతులు అధిక వడ్డీ రేట్ల కారణంగా కొన్ని రంగాల్లో నెలకొన్న తీవ్ర ప్రతికూలత దీనికి కారణమని తాజాగా ఫిక్కీ చేపట్టిన వ్యాపార విశ్వాస (బిజినెస్ కాన్ఫిడెన్స్) సర్వేలో వెల్లడైంది. 17 విభిన్న రంగాలకు చెందిన మొత్తం 321 కంపెనీల అభిప్రాయాలను సర్వేలో పొందుపరిచారు. వ్యాపార విశ్వాసం ఆరు నెలల క్రితం 68.4 పాయింట్లు కాగా ఇప్పుడు 61.2 శాతానికి క్షీణించింది. అంతేకాదు ప్రస్తుత పరిస్థితుల సూచి, అంచనాల సూచి, మొత్తం వ్యాపార విశ్వాస సూచీ ఈ మూడూ అయిదేళ్ల అత్యల్ప స్థాయిని తాకాయని సర్వే పేర్కొంది. దాని ముఖ్యాంశాలు తెలుసుకుందాం.

- ఆర్థిక వృద్ధిరేటు రెండో త్రైమాసికంలో 8.9 శాతానికే పరిమితం కావడం వాణిజ్య వర్గాలను తీవ్ర నిరాశకు గురి చేస్తోంది. క్రితం ఏడాది ఇదే కాలంలో వృద్ధి రేటు 10.2 శాతంగా వుంది.
- మొత్తం మీద ఆర్థిక వ్యవస్థ నెమ్మదించేందుకు ఎగుమతుల క్షీణతతో పాటు కొన్ని కీలకమైన రంగాల మందగమనం కూడా తోడైంది.
- రూపాయి మరింత బలపడకుండా చర్యలు తీసుకోవడం, రిజర్వు బ్యాంకు ప్రస్తుతం అవలంభిస్తున్న కఠినతరమైన ద్రవ్య విధానాన్ని సమీక్షించాల్సిందిగా సర్వే విజ్ఞప్తి చేసింది.
- ఇప్పటికైనా ప్రభుత్వం, ఆర్‌బీఐ తగినంత చొరవ చూపకపోతే మొత్తం పారిశ్రామిక రంగం తిరోగమనంతోపాటు కోలుకోలేని స్థాయికి దిగజారే ప్రమాదం వుంది.
- సిమెంటు, ఔషధాలు, జౌళి, దుస్తులు తదితర రూ. కోటి నుంచి రూ. 8000 కోట్ల స్థాయి కంపెనీలు సర్వేలో పాల్గొన్నాయి. ముడిసరుకుల ధరలు భారీగా పెరిగిపోవటం కంపెనీల పనితీరును ప్రభావితం చేస్తోంది.



# వ్యాపారానుకూలతలో
## భారత్‌ది 120వ స్థానం

వ్యాపారం చేసేందుకు అత్యంత సానుకూల పరిస్థితులు కలిగిన దేశాల్లో భారత్‌ది 120వ స్థానంలో నిలిచింది. అంతర్జాతీయ ఫైనాన్స్ కార్పొరేషన్, ప్రపంచ బ్యాంకు, భారత పరిశ్రమల సమాఖ్య సంయుక్తంగా విడుదల చేసిన 'డూయింగ్ బిజినెస్ 2008' నివేదికలో మొత్తం 178 దేశాలను పరిగణనలోకి తీసుకున్నారు. భారత్ ఇప్పటికీ అట్టడుగు స్థానంలోనే ఉన్నప్పటికీ గత ఏడాది (2006) 132వ స్థానంలో పోలిస్తే 12 స్థానాలను మెరుగుపరుచుకోవడం విశేషం. స్థానాల వృద్ధిలో చైనా కంటే భారత్ ముందుంది. ఈ సూచిలో చైనా ఈ ఏడాది 9 స్థానాలు ఎగబాకి 83వ స్థానానికి చేరింది. జాబితాలో తొలి స్థానాన్ని దక్షిణాఫ్రికా దక్కించుకుంది. చుట్టు ప్రక్కల దేశాలైన మాల్దీవులు (60) పాకిస్తాన్ (76) బంగ్లాదేశ్ (107) శ్రీలంక (101) నేపాల్ (111) భూటాన్ (119)ల కంటే భారత ఇంకా వెనుకబడే ఉండటం గమనార్హం.

**ప్రభుత్వేతర సంస్థలు**

**అనుకూలతలు**

- భారీ స్థాయిలో కార్యకలాపాలు
- స్వయం సమృద్ధికి బలం చేకూరుతుంది.
- నైపుణ్యాలు పెరుగుతాయి.
- పరపతి పెంపు, విస్తృతమైన నెట్‌వర్క్‌ను నెలకొల్పేందుకు చేయూత

**ప్రతికూలతలు**

- స్వతంత్ర నిర్ణయాలకు ఆటంకం
- దీర్ఘకాలిక ప్రాజెక్టులను నీరుగార్చే అవకాశం
- సామాజిక నిబద్ధత తగ్గే ప్రమాదం

**కార్పొరేట్ సంస్థలు**

**అనుకూలతలు**

# సంపాదన ఒక కళ

డబ్బు సంపాదించటం ఒక కళ. అయితే దానిని ఇంత వింతలుగా పెంచుకోవడం కూడా ఆరిన తేరిన కళ అవుతుంది. పూర్వకాలంలో అయితే అందరూ పొలం - భూమి - నగలు - కార్లు - బంగళాలు కొంటుండేవారు. అయితే యీనాడు బ్యాంకులలో ఫిక్సడ్ డిపాజిట్‌లు, షేర్లు, మ్యూచుఫండ్స్ వగైరాలపై మోజు పెరిగిపోయింది.

ప్రస్తుతం సరికొత్త సంపన్న వర్గం ముందుకు దూసుకుపోతున్నది. వారు అతి స్వల్ప వ్యవధిలో శ్రీమంతులు అవుతున్నవాళ్లు పెచ్చు పెరిగిపోతున్నారు.

వారు సంపాదించిన డబ్బును దాచుకోవటానికి అనుసరిస్తున్న విధానమే వీరిని శ్రీమంతులను చేస్తున్నది.

పుట్టుకతోనే ధనవంతులు కాక, తమ ధైర్య సాహసాలకు సాక్షాత్తు ఐశ్వర్య లక్ష్మి ముచ్చటపడి వరించి వచ్చే విజేతలూ వుంటారు. వారిని వాణిజ్య పరిభాషలో అధిక నికర విలువ కలిగిన వ్యక్తులు హెచ్.ఎన్.ఐ.లుగా వ్యవహరిస్తున్నారు. సంవత్సరం - సంవత్సరం దేశంలో ఇలాంటి వారి సంఖ్య లక్షలకు చేరుకుంటున్నది.

ఇది మరింతగా పెరిగే సూచనలే కనపడుతున్నాయి తప్ప తగ్గే అవకాశం ఎక్కడా కనపడటం లేదు.

ఏడాదికి నాలుగు కోట్ల రూపాయలకు పైగా పెట్టుబడి పెట్టతగ్గ సొమ్మును వీరు సంపాదిస్తున్నట్లు నివేదిక చెబుతోంది.

ఇంకా మరింతగా పెరిగే సూచనలే కనిపిస్తున్నాయి. యువ సి.ఈ.ఓ.లు పెద్ద కంపెనీల్లో సీనియర్ అధికారులు, వ్యాపార రంగంలోకి అడుగుపెట్టి అనతికాలంలోనే విజయం వరించిన వారు, వృత్తి నిపుణులు, తమ కంపెనీల్లో వాటాను (స్టేక్స్) విక్రయించిన వారు, తాము పనిచేస్తున్న కంపెనీలో షేర్ల కేటాయింపు (ఎసాప్) నకు నోచుకున్న సిబ్బంది తదితరులు ఈ కోవలోకి వస్తున్నారు. స్టాక్ మార్కెట్ పట్టపగ్గాలు లేకుండా ఎదుగుతూండటంతో ఎసాప్స్ వున్న ఉద్యోగులకు పట్టిందల్లా బంగారం అవుతోంది.



### వీరు ఏం చేస్తున్నారు?

తండ్రులు, తాత ముత్తాతలు సంపాదించిన ఆస్తిపాస్తుల వల్ల లక్ష్మీ పుత్రులుగా చలామణీ అవుతున్న వారిని మినహాయిస్తే, తాజా కోటీశ్వరుల్లో పలువురు యువతరం ప్రతినిధులే. పాత కోటీశ్వరులు నష్టభయంతో తరాల వారసత్వంగా సంక్రమించిన సంపదను కాపాడుకోవటానికి మాత్రమే ప్రాధాన్యం యిచ్చేవారు. కానీ కొత్తగా సిరివచ్చిన వారు చిన్న వయసులోనే మదుపు సొమ్మును పెంచుకోవడానికి ముందు కురుకుతూ వున్నారు. 'అసలు'కు ముప్పు రాకుండా వివిధ రకాల పోర్ట్ పోలియో మేనేజ్‌మెంట్ కళను ఔపోశన పడుతున్నారు.

వీరికి ప్రతిఫలాలూ హెచ్చుగానే వున్నాయి, వుంటున్నాయి.

### ఇవీ మార్గాలు

దేశం వెలుపలి (ఓవర్సీస్) స్టాక్ మార్కెట్ల లావాదేవీల్లో భాగం పంచుకొనేందుకు ఉద్దేశించిన ప్రత్యేక మ్యూచువల్ ఫండ్ పథకాలు, స్వర్ణమారక వాణిజ్య ఫండ్‌లు (జీటీఎఫ్) ఆర్ట్/వైన్ ఫండ్‌లు, వెంచర్ క్యాపిటల్ ఫండ్‌లు, ఫ్యూచర్స్, కమోడిటీస్ ట్రేడింగ్ వంటి వాటితో ప్రమేయం పెట్టుకుంటున్నారు. అయితే యిప్పటికీ మార్కెట్ నియంత్రణలో భాగంగా అమలు అవుతున్న నియమనిబంధనలు వారి చేతులను కట్టి పడేస్తున్నాయనే చెప్పవచ్చు. కమోడిటీస్, ఫారెక్స్ డెరివేటివ్స్ వంటి కిటికీలు ఇంకా మూసే ఉంటూండటం ఇందుకు నిదర్శనం.

# భారత స్టాక్‌మార్కెట్ కష్టంతో కూడుకున్నదే - సిటీగ్రూప్

ఆసియాలో అత్యంత వ్యయభరిత స్టాక్ మార్కెట్లలో చైనా తర్వాత రెండో స్థానంలో భారత్ నిలిచింది. దూసుకుపోతున్న ఆర్థిక వృద్ధి నేపథ్యంలో లావాదేవీలు భారీగా పెరగటం ఇందుకు దోహదం చేసిందని అంతర్జాతీయ ఫైనాన్షియల్ సేవల సంస్థ సిటీ గ్రూప్ ఒక నివేదికలో వెల్లడించింది. అయితే చైనాతో పోలిస్తే ఇటీవలి నుంచి భారత మార్కెట్ల గమనంలో వృద్ధి కంటే క్షీణతే ఎక్కువగా వుందని పేర్కొంది. ఆసియా పసిఫిక్ సూచీ 8.39 శాతం దిగజారడమే దీనికి కారణంగా సిటీగ్రూప్ తెలిపింది. ఇండోనేషియాను తప్పిస్తే ఈ సూచీలో అన్ని విభాగాలు వ్యతిరేక ఫలితాలనే నమోదు చేశాయని సమీక్షలో తేలింది. అయితే జపాన్ యీ సూచీలో భాగస్వామి కాదు. నెలవారీ సమీక్ష ప్రకారం భారత్‌లో ఇటీవల వ్యతిరేక సెంటిమెంట్ వ్యక్తమైనప్పటికీ షేర్ల ధరల కదలిక విషయంలో మాత్రం పటిష్టంగానే సాగుతోంది. పెరుగుతున్న స్టాక్ విలువ కారణంగా భారత్ మార్కెట్ అత్యంత వ్యయభరితంగా మారుతోందని నివేదిక పేర్కొంది.

**పెట్టుబడుల నిర్ణయాలు**

జీవనశైలి మారుతోంది. ఒత్తిడులు పెరుగుతున్నాయి. దీంతో చాలామంది ముందుగానే పదవీ విరమణకు మక్కువ చూపుతున్నారు. మరో ప్రక్క పట్టణ ప్రాంతాల్లో సగటు జీవన ప్రమాణం 84 ఏళ్లకు చేరుతోంది. ఈ నేపథ్యంలో పదవీ విరమణ తర్వాత మెరుగైన జీవితాన్ని గడపాలంటే ఎలాగో పరిశీలిద్దాం.

దీనికి పొదుపు - మదుపులు అవసరం. చాలామందికి ఇటువంటి వాటిపై అవగాహన లోపిస్తుంది అంటున్నారు ప్రముఖులు.

- వయసు పెరిగే కొద్దీ పొదుపు చేసే స్తోమత తగ్గిపోతుంది. చిన్న వయసు నుంచే పొదుపు చేయాలి.
- ప్రతి ఒక్కరూ అవసరాలూ, స్థాయిలకు అనుగుణంగా పొదుపు ప్రణాళికలను రూపొందించుకోవాలి.
- డిపాజిట్లు - షేర్లు, మ్యూచువల్ ఫండ్‌లు, స్థిరాస్తి వంటి వాటిల్లో పెట్టుబడులు పెట్టాలి.
- ప్రతి మదుపు సాధనం ఎల్లప్పుడూ ఆకర్షణీయ ప్రతిఫలాన్ని ఇవ్వలేదు. వాటికీ చక్రీయ స్వభావం వుంటుంది. గరిష్ట ప్రయోజనం పొందాలంటే పెట్టుబడులకు వివిధ సాధనాలను ఎంచుకోవాలి.
- బాధ్యతలు, వచ్చే ఆదాయం, వయసులను దృష్టిలో పెట్టుకుని పెట్టుబడి నిర్ణయాలు తీసుకోవాలి.
- 40-50 శాతం మంది పిల్లల చదువులు, పదవీ విరమణ తదుపరి జీవనం ధ్యేయంతో పొదుపు చేస్తుంటారు. ఇది అభిలషణీయమే.
- స్వల్ప కాలానికి షేర్లతో పెట్టుబడి పెట్టడమంటే ఒక విధంగా నష్ట భయంతో కూడకున్నదే. అయితే దీర్ఘకాలానికి మంచి ప్రతిఫలాన్నిస్తుంది. పదేళ్ల కాలాన్ని తీసుకుంటే సగటున 22 శాతం ప్రతిఫలం లభించగలదని గణాంకాలు చెబుతూ వుండటం ఇందుకో ఉదాహరణ.
- రోగం వచ్చినప్పుడు ఆపసోపాలు పడిపోతూ డబ్బుకోసం వెంపర్లాడే బదులు చాలా స్వల్ప మొత్తం వ్యయంతో ఎంతటి పెద్ద చికిత్స ఖర్చునైనా కేవలం 'బీమా'తో భరించొచ్చు. ప్రతి ఒక్కరి పొదుపు ప్రణాళికలో బీమా కీలక అంశం కావాలి.
- వార్షిక ఆదాయంలో 6-10 రెట్లు లభించే విధంగా బీమా చేయాలి.

# లాభాలు తెలుసుకుందాం

ఎవరైనా వ్యాపారం ఎందుకు చేస్తారు? లాభానికే అందరూ చేస్తారు. అయితే ఎక్కువ లాభాలు రావాలంటే ఏం చేయాలో తెలుసుకుందాం. మనం చేస్తున్న వ్యాపారం బాగుండాలి. దానికి డిమాండ్ వుండాలి. దానికి మంచి గిరాకీ వుండాలి. సరుకు ఎంత బాగుంటే మార్కెట్లో అంత ఎక్కువ పేరు వస్తుంది. అది ఎంత పెద్ద పేరు వస్తుందో అంతే శాతం లాభాలు పొందవచ్చు. ప్రస్తుతం మౌలిక సదుపాయాలు రియల్ ఎస్టేట్ రంగాలదీ ఇదే పరిస్థితి.

ఇందులో షేర్స్ తీసుకుంటే లాభాన్ని ఆర్జించటం పెద్ద కష్టమేమీ కాదు. అందుకే హేమాహేమీల్లాంటి మ్యూచువల్ సంస్థలు స్వల్ప వ్యవధిలో కొన్ని పథకాల్ని ప్రవేశపెట్టాయి. మదుపరులను ఆ పథకాలు విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఈ ఫండ్ల యొక్క ప్రత్యేకతలేమిటో వివరంగా తెలుసుకుందాం.

రోడ్లు, వంతెనలు, రేవులు, విమానాశ్రయాలు, రైల్వేలు, టెలికాం, విద్యుత్తు వంటి మౌలిక సదుపాయాలు మెరుగ్గా వుంటే అభివృద్ధికి పట్టపగ్గాలుండవు. మన దేశంలో ఇది వాస్తవ రూపం దాల్చటానికి వచ్చే ఐదేళ్లలో రూ. 15 లక్షల కోట్లు కావాల్సి వుంటుంది. భవిష్యత్తులో అభివృద్ధికి ఢోకా వుండదు. కాబట్టి ఇందులో మదుపు చేసే ఫండ్ల సంఖ్య పెరుగుతుంది. గురి చూసి మదుపు చేయాలే కానీ లాభాల్ని సులువుగా అందుకోవచ్చు.

మీరు ఒక కంపెనీలో పెట్టుబడి పెట్టాలనుకున్నారనుకోండి. ఆ కంపెనీ-క్యాష్ బేలన్స్‌లు అపారంగా వుండాలి. అంతే గాని చేతిలో డబ్బులేకపోతే యిబ్బంది పడవలసి వస్తుంది.

కంపెనీకి అప్పులు వుండకూడదు.

ఆర్డర్లు కూడా దండిగా వుండాలి. కొన్ని కంపెనీలు వుంటాయి. అవి ప్రజల నుండి పెట్టుబడులను ఆహ్వానిస్తాయి. వారి నుండి షేర్‌కి ఇంత అని ఆఫర్ చేసి మూల ధనాన్ని సేకరిస్తారు.

కాబట్టి ఏ కంపెనీవయినా షేర్లు మనం కొనాలనుకుంటే అసలు ఆ కంపెనీకి అప్పులున్నాయా? ఆ కంపెనీ వడ్డీ రూపంలో ఎంత చెల్లించాలి మొదలైన వివరాలు తెలుసుకోవాలి. యీ వివరాలు కావాలంటే కంపెనీ వార్షిక రిపోర్టులలో లభిస్తాయి.

మనం షేర్లు కొనాలనుకుంటున్న కంపెనీ ఉత్పత్తులు ఏమిటో ముందు తెలుసుకోవాలి. అయితే యీ విషయం చాలామందికి తెలియదు. ఎవరో ఏదో చెప్పారని గభాల్న వెళ్లి కొనేస్తారు. ఎవరో చెప్పారు కదాని ఏమీ తెలుసుకోకుండా ఒక కంపెనీ షేర్లను కొని ఆ వివరాలు తెలుసుకున్నాక విచారిస్తుంటారు.

షేర్లు కొనాలంటే ముందు మార్కెట్ పరిజ్ఞానం అవసరం.

ఎవరు ఏమి చెప్పినా – చెప్పకపోయినా ఒక కంపెనీ షేరు మీరు కొంటున్నారంటే ఆ కంపెనీ పూర్వాపరాలు మొత్తం తెలుసుకోవాలి.

- ఈ కంపెనీ చేతిలో భారీగా ఆర్డర్సు వున్నాయా? లేదా?
- డివిడెండ్ ఎలా ఇస్తున్నారు? ఫ్యూచర్లో ఎంత యిచ్చారు?
- ఈ కంపెనీకి సేమ్ ప్రాడెక్టు కంపెనీ పోటీ ఏదయినా వుందా?
- అసలు యీ కంపెనీ ఉత్పత్తులు ఏమిటి?
- ఆ ఉత్పత్తులకు మార్కెట్‌లో డిమాండ్ వుందా?
- కంపెనీ నిర్వహణ ఎలా వుంది? సమర్ధవంతంగా నిర్వహణ జరుగుతున్నదా?
- ఈ కంపెనీ ఫ్యూచర్ ప్లాన్సు ఏమిటి?
- అంతకు ముందు లాభాలు ఏ శాతంలో సంపాదించింది?
- ఈ విషయాలన్నీ మీరు తెలుసుకుంటే ఆ కంపెనీలో మీరు షేర్స్ కొనవచ్చా? కొనకూడదా అనేది మీరే నిర్ణయించుకోవచ్చు.
- కొన్ని కంపెనీలు బాగా రన్ అవుతూనే దివాళా తీస్తాయి. అందుకు ప్రధాన కారణం కంపెనీ మేనేజ్‌మెంటు.
- ఎం.డి.లకుగాని – మేనేజర్లకుగాని వేలకు వేలు జీతాలుంటాయి. వాటితో వాళ్లు సుఖజీవనం చేస్తున్నారు.

**తక్కువ రేటు షేర్లను కించపరచకూడదు**

స్టాక్ మార్కెట్‌లో కొన్ని కంపెనీలు తారాపథంలో వెలిగిపోతుంటాయి. షేర్స్ కొన్ని రేజ్‌లో వుంటాయి. వాటినే కొనాలని అందరూ అభిలషిస్తారు.

అయితే మనం దాని ఉత్పత్తులను కంపెనీని బాగా గమనించాలి. నాణానికి ఒకవైపు బొమ్మ - మరోవైపు బొరుసు వుంటాయి. రేజ్‌లో వున్న కంపెనీల షేర్స్ కొనాలనుకునే వారికి బొమ్మే కనిపిస్తుంది. బొరుసు వుందనే విషయం కూడా గమనించరు. అది మానవ నైజం. అంతా తమవైపే ఆలోచిస్తారు. ఎంతసేపూ తమ సక్సెస్ గురించి ఆలోచిస్తారు తప్ప - ఫెయిల్యూర్ గురించి ఆలోచించరు. ఒక వేళ ఎవరైనా చెప్పినా అది చెవికి ఎక్కదు. అసలు వినపడదు.

టాప్‌లో నడుస్తున్న ఆ కంపెనీ అలానే నడుస్తుందని ఆశిస్తారు. అయితే వాళ్లు వూహించింది కరెక్టే. అయితే అది నిలకడగా వుండదు. తరువాత దాని అసలు రంగు బయటపడుతుంది. ఇలా కావటానికి కారణాలు చాలా వున్నాయి. ఈ కారణాలు కావచ్చని ప్రముఖులు చెబుతున్నారు.

- మేనేజ్‌మెంట్ లోపం కావచ్చు.
- వాళ్ల ఉత్పత్తి ప్రజలకు నచ్చకపోవచ్చు.
- అందులో నాణ్యత లోపించవచ్చు.
- లేదా మరో కంపెనీ ఇదే ప్రోడక్టుని యింకా బాగా ఉత్పత్తి చేయటం లాంటిది.
- ఆర్డర్స్ ఎక్కువ వుండాలి. వాటిని సద్వినియోగపర్చాలి. సకాలంలో పార్టీకి ఉత్పత్తికి సరఫరా చేయాలి.
- యివన్నీ సజావుగా వుంటే కంపెనీకి డోకా వుండదు.



# ఊహించింది తారుమారు

రామారావు ఆ రాత్రి సినిమా చూసి వచ్చి నిద్రపోతున్నాడు. ఉదయం లేవలేక యింకా నిద్రపోతూనే వున్నాడు.

రామారావు భార్య సునందిని కాఫీ తీసుకొచ్చి భర్తను లేపింది.

రామారావు లేవగానే టి.వి. ఆన్ చేశాడు. ఒక కంపెనీ షేర్ ధర విపరీతంగా పెరిగినట్టు టి.వి.లో చూపించారు. వెంటనే రామారావు, రంగారావుకు ఫోన్ చేసి విషయం చెప్పాడు నేనూ విన్నానన్నాడు రంగారావు.

ఈ వార్త దావానలంగా దేశమంతా వ్యాప్తి చెందింది. దాంతో ఆ షేరు యింకా విపరీతంగా పెరుగుతుందని ఇన్వెస్టర్లలో నమ్మకం విపరీతంగా పెరిగిపోయి అన్ని కౌంటర్లలో జనం గుమిగూడి షేర్లు విపరీతంగా కొనేశారు.

అందరూ పొరపాటు పడ్డారు.



వారు ఆశించిందంతా తారుమారు అయింది. అందరూ ఆ షేరు గురించి ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. ఆ ఆశలన్నీ అడియాసలయ్యాయి.

ఆ షేరు పెరగలేదు సరికదా తగ్గింది. కారణం ఏమిటంటే ఆ రోజున చాలా ఎక్కువమంది ఆ షేర్లు కొన్నారు. ఆ వార్త విన్న వాళ్లు అందరూ వురికారు. అందుకే అలా జరిగింది.

# ఇన్వెస్టర్లకు కొత్త పథకాలు

మనదేశం ఆది నుంచీ వ్యవసాయ ప్రధానమైనదే! ఇప్పటికీ దీనిమీద ఆధారపడిన పరిశ్రమలే ఎక్కువ. కొంతకాలంగా మౌలిక సదుపాయాల రంగం కూడా శరవేగంగా అభివృద్ధి చెందుతుంది. అందుకే యీ రెండు రంగాలు కూడా పెట్టుబడి పెట్టడానికి మంచి అవకాశాన్ని సృష్టిస్తున్నాయి.

దీర్ఘకాలానికి పెట్టుబడి పెడితే మంచి రాబడిని అందించేవిగా ఈ రంగాలను చెప్పుకోవచ్చు. అలా ఆలోచించే వారి కోసమే జెఎమ్ అగ్రి అండ్ ఇన్‌ఫ్రా ఫండ్ అందుబాటులోకి వచ్చింది. ఈ పథకం వ్యవసాయం, మౌలిక వసతుల రంగాలలో పెట్టుబడి పెడుతుంది. సమీకరించిన మొత్తం సొమ్ములో 62 శాతం వరకూ ఈ రంగాలకు ప్రత్యేకిస్తారు. మిగతా దానిని డెట్/మనీ మార్కెట్లో పెట్టుబడి పెడతారు. మౌలిక సదుపాయాల కంపెనీలో అగ్రగామిగా వున్న 25 నుంచి 30 కంపెనీలను ఎంచుకుని పెట్టుబడి పెడతారు.

ఇది మూడేళ్ల క్లోజ్ ఎండెడ్ పథకం. యూనిట్లు కేటాయించిన మూడు నెలల తర్వాత వాటిని సొమ్ము చేసుకునే అవకాశం వుంది. నెల ప్రారంభంలో మొదటి అయిదు వ్యాపార రోజుల్లో ఈ అవకాశాన్ని కల్పిస్తారు. కనీసం రూ. 500 గానీ, లేదా 50 యూనిట్లుగానీ అమ్మాల్సి వుంటుంది. కాల పరిమితి తీరగానే ఏ రోజైనా అమ్ముకోవటానికి అవకాశం వుంటుంది.

**అవకాశాలు చూద్దాం**

ప్రస్తుతం వ్యవసాయం కూడా కార్పొరేట్ చేతుల్లోకి వెళ్లిపోయింది. ఫుడ్ ప్రాసెసింగ్, పాల ఉత్పత్తుల పరిశ్రమలో భారీ పెట్టుబడులు వెల్లు వెత్తుతున్నాయి. రిటైల్ రంగంలో మంచి అవకాశాలు కల్పిస్తున్నాయి. మౌలిక సదుపాయాల రంగం కూడా బాగా పని చేస్తుంది. కాబట్టి వీటిలో పెట్టుబడికి ఎలాంటి ఢోకా లేదనే నమ్మవచ్చు.

**వేచి చూద్దాం**

ఇప్పటికిప్పుడు లాభాలు ఆర్జించాలనుకునే వారికి ఈ ఫండ్ అచ్చిరాదనే చెప్పవచ్చు. భవిష్యత్తు మీద భరోసాతోనే ఈ ఫండ్ ఆయా రంగాల్లో పెట్టుబడి పెడుతోంది.



అంటే కనీసం నాలుగైదేళ్లు ఆగితేగానీ ఆశించిన రాబడిని అందుకోలేమన్నమాట.

యీ పథకం పేరు జెఎం అగ్రి అండ్ ఇన్‌ఫ్రా ఫండ్. జెఎం ఫైనాన్షియల్ ఫండ్.

**లాభసాటి షేర్లు**

తక్కువ సమయంలో ఎక్కువ డబ్బు సంపాదించాలంటే షేర్లలో పెట్టుబడి పెడితే సరిపోతుందిగా అనుకుంటారు మనలో చాలామంది. తీరా సరైన అవగాహన లేకో, కాలం కలిసి రాకో షేర్లు కాల్తే... సారీ, చేతులు కాల్తే లబోదిబోమనాల్సిందే. అందుకే స్టాక్‌మార్కెట్‌లో మంచి పెట్టుబడి అవకాశాన్ని బేరీజు వేయటంలోనే సిసలు సామర్థ్యం బయటపడుతుంది. కొన్ని కొండ గుర్తుల్ని దృష్టిలో పెట్టుకుంటే కూల్చుతాయనుకున్న షేర్లే లాభాలు కురిపించినా ఆశ్చర్యపోనక్కర్లేదు.

**ప్రభుత్వ విధానాల్లో మార్పులు**

ప్రభుత్వ విధానాల్లో మార్పులు పలు సందర్భాల్లో కొన్ని కంపెనీలకు సరికొత్త అవకాశాలను తెచ్చిపెడుతూ వుంటాయి. 1980లలో సిమెంటుపై ధరల ఆంక్షలను సడలించటం ఏసీసీ తదితర కంపెనీలు ఒక్క ఉదుటున పురోగమించడానికి కారణం అయింది. 1988లో అల్యూమినియంపై ధరల నియంత్రణలను తొలగించడంతో హిండాల్కో ఇండియన్ అల్యూమినియం వంటి కొన్ని కంపెనీల లాభాలు పెరగడానికి మూలమైంది. అయితే, ప్రభుత్వ విధాన మార్పు ఒక్కొక్కసారి కంపెనీలపై వ్యతిరేక ప్రభావాన్నీ కలగజేయొచ్చు. 2004 లో దిగుమతి చేసుకునే ఉక్కు వస్తువుల పైన కస్టమ్స్ సుంకాల్లో కోత విధించటం వల్ల టిస్కో, సెయిల్, ఎస్సార్ గుజరాత్ వంటి కంపెనీల చౌక దిగుమతులతో పోటీని తీవ్రతరం చేసింది. ఇలాంటి చిక్కులు వున్నాయని ఒక షేర్ హోల్డర్‌గా ముందుగా అంచనా వేసుకోగలిగితే ఆ కంపెనీల షేర్ల ధరలు పడిపోయే లోగానే వాటిని అమ్మి వేసి లాభపడవచ్చు.

**సంస్థను మలుపు తిప్పే పరిణామాలు**

కొన్నేళ్లుగా నష్టాల బారినపడుతూ, ఉన్నట్లుండి సరైన మార్గంలోకి వచ్చి లాభాలు కళ్లజూడగలుగుతుందన్న అంచనాలను సమీపించే కంపెనీలను ఓ కంట కనిపెడు తుండాలి.

అంతవరకు నష్టాల్లో వున్న ఈ సంస్థల షేర్లు ముఖ విలువ కన్నా తక్కువ ధరలకు ట్రేడవుతూ వుంటాయి. పేరుకుపోయిన నష్టాలను క్రమంగా తుడిచిపెట్టి లాభార్జన దశకు సదరు కంపెనీ చేరుకోవటంతోనే ఆ ప్రభావం షేరు ధరపై పడుతుంది. అది మెల్లగా పెరగడం మొదలు పెడుతుంది. ఈ పెరుగుదల అనేది ఒక్కోసారి 200-300 శాతం వరకు వున్నా ఆశ్చర్యపోనక్కరలేదు. ఇటీవల సెయిల్ ఇలా మలుపు తిరిగిన (టర్న్ ఎరౌండ్) కంపెనీగా నిలిచింది.

నాలుగేళ్ల కిందట ఈ కంపెనీ షేరు ధర రూ. 6 వుంది. ఉక్కు పరిశ్రమకు మహర్దశ పట్టడంతో 2004 మొదట్లో ఈ కంపెనీ షేరు రూ. 55 దాకా వెళ్లింది. అయితే ఇలా మలుపు తిరిగిన కంపెనీలు వాటి పని తీరును ఏదో కొంత కాలానికి మెరుగుపర్చుకోవటం అని కాకుండా సుదీర్ఘకాలం పాటు అదే సత్తాను నిలుపుకున్నప్పుడే వీటి షేర్లు లాభసాటిగా ఉంటాయని గుర్తుంచుకోవాలి.

**కంపెనీల భవిష్యత్తు వృద్ధి అవకాశాలు**

కొత్తగా వెలుగులోకి వచ్చి భవిష్యత్తులో ఎదుగుదలకు చక్కని అవకాశాలు వున్న పరిశ్రమల్లోని కంపెనీలు ఏవన్నది కనుక్కోగలగాలి. ఓపిగ్గా అన్వేషించి దూరదృష్టితో వ్యవహరిస్తే ఆకర్షణీయ ప్రతిఫలాలను సొంతం చేసుకోవచ్చు. మచ్చుకు ఆరో దశకంలో సింథటిక్ వస్త్రాలు, స్కూటర్లు అయిదు నక్షత్రాల హొటల్ కంపెనీల భవిత ఉజ్వలంగా ఉంటుందని భావించారు. ఆ రోజుల్లో బజాజ్ ఆటో, ఇండియన్ హొటల్స్, గ్వాలియర్ రేయాన్ (ప్రస్తుత పేరు గ్రాసిమ్) సెంచరీ స్పిన్నింగ్ ఇప్పుడు (సెంచరీ టెక్స్‌టైల్స్) వంటి గత ముప్పై ఏళ్లలో పెద్ద ఎత్తున లాభాలు పోగయ్యేవే సుమా. ఇక 21వ శతాబ్దంలో భవిత ఉజ్వలంగా ఉండే పరిశ్రమల్లో కంప్యూటర్ సాఫ్ట్‌వేర్, కంప్యూటర్ శిక్షణ బయోటెక్నాలజీ, ఫుడ్ ప్రాసెసింగ్, టెలి కమ్యూనికేషన్లు కార్పొరేట్ ప్రతులు, బడ్జెట్ హొటళ్లు, ప్రైవేట్ విమానయాన సంస్థలు, చమురు అన్వేషణ, కాలుష్య నివారణ, రోగ నిర్ధారణ సామాగ్రి, తయారీ యూనిట్లు డిపార్ట్‌మెంటల్ స్టోర్లు ఫాస్ట్‌ఫుడ్ దుకాణాల నిర్వహణ వంటివి వున్నాయని నిపుణులు అంటున్నారు.

**విలీనాలు**

ఇటువంటి కీలకమైన పరిణామాలు చాలా వరకు ఆయా పరిశ్రమల్లో వ్యాపారాన్ని బలోపేతం చేసుకునే ధ్యేయంతో జరుగుతూ వుంటాయి. ఒక్కోసారి లాభదాయక కంపెనీ



నష్టాలు వస్తున్న కంపెనీని తాను అక్కున చేర్చుకోవటం వల్ల మొదటి కంపెనీ లాభాలను రెండో కంపెనీ నష్టాల్లో కలిపి రాసే' ి పన్నును చెల్లించకుండా ప్రయోజనం పొందేందుకు ఆస్కారం వుంటుంది. ఒకే తరహా ఉత్పత్తి ప్రక్రియలు వున్న మాతృ, అనుబంధ కంపెనీలు జట్టుకడితే వ్యయాలను గణనీయంగా తగ్గించుకుని ఆ మేరకు డబ్బును ఇతరత్రా వినియోగానికి మళ్లించుకోగలుగుతాయి. కాబట్టి ఇలాంటి నిర్ణయాల ప్రకటనలను జాగ్రత్తగా అధ్యయనం చేయడం లోగుట్టును విప్పడానికి తోడ్పడుతుంది. భావి విలీనాల ప్రకటన టేకోవర్ యత్నాలు సామాన్యంగా షేర్ల ధరలు ఎగబాకడానికి దోహదం చేస్తాయి.

**భావి పరిణామాల అంచనా**

ముమ్ముందు ఏం జరగవచ్చునే దానిపై క్షుణ్ణమైన అవగాహన ఏర్పరుచుకున్న వారికి ఉత్తమమైన పెట్టుబడి అవకాశాలను ఒడిసి పట్టుకోవటం సులువు అవుతుంది. మరి రేపు ఏం జరగనుందో ఎలా తెలుసుకోవడం? ఇందుకు ఉత్తమమైన పద్ధతి ఏమిటంటే వర్తమానంలో జరుగుతున్న సంఘటనలను అత్యంత చురుగ్గా అధ్యయనం చేస్తూ వుండటమే. ఉదాహరణకు గాలీ, నీరూ అమిత వేగంఆ కలుషితం అవుతున్నాయి కదా! పర్యావరణ పరిరక్షణ అనేది ప్రభుత్వాలతోపాటు ప్రజలకు కూడా ప్రమేయం వున్న కర్తవ్యం. ప్రభుత్వం ఇప్పటికే ఈ దిశగా కొన్ని చట్టాలు చేసింది. వాటి అమలుకు ఓ ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేసింది. ఈ పరిణామాలన్నీ వాయు, జల, కాలుష్య నివారక సామాగ్రి ఉత్పత్తి సంస్థలకు రాచబాట వేసేవి. అంతేకాదు; ఆరోగ్య సంరక్షణ రంగం వృద్ధికి సూచికలుగా నిలిచేవీనూ.

**అంతర్జాతీయ ధోరణులపై నిఘా**

1990ల తరువాత నుంచి ప్రపంచీకరణ తారక మంత్రంపై కూర్చుంది. అంతర్జాతీయ ఆర్థిక సరళి ప్రభావానికి దూరంగా ఏ దేశమూ వుండిపోలేని తరుణం వచ్చేసింది. దీంతో భారతీయ స్టాక్ మార్కెట్ మదుపరులు ఏమరుపాటు తనాన్ని వీడి, దేశం లోపలే కాక దేశం వెలుపల సైతం ఎలాంటి ఆర్థికపరమైన మార్పులు జరుగుతున్నదీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, అవి మన దేశ కంపెనీల పని తీరుపై ప్రసరింప చేయగల చీకటిని లేదా వెలుగులను గురించి అంచనా వేసుకోవలసిన అగత్యాన్ని కొని తెచ్చింది. ఉదాహరణకు WTO ఒప్పందంలో భారత్ భాగస్వామి కావటం వల్ల మన

దేశ ఆహార, ఔషధ, వస్త్ర ఐటీ ఎగుమతి సంస్థలకు అపార అవకాశాలు ఎదురవుతున్నాయి. సముద్ర మార్గ వ్యాపార పరిమాణం ఏళ్ల తరబడి వర్ధిల్లేందుకు వేదిక సిద్ధం అయింది. ఇది షిప్పింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా గ్రేట్ ఇండియన్ షిప్పింగ్ వంటి నౌకా రవాణా కంపెనీలను కలిసొచ్చేది. ఈ తరహా విశ్లేషణ చైతన్యాన్ని పెంచుకునే ఇన్వెస్టర్లకు తదనుగుణంగానే పెట్టుబడి వ్యూహాల్ని ఎన్నుకుని, ఇతర సామాన్య మదుపరుల కన్నా ఒకటి రెండు అడుగులు ముందు వుండే వీలు చిక్కుతుంది.

**మదుపరి ఏది సరి?**

సుబ్బారావు ఎన్నాళ్లగానో మ్యూచువల్ ఫండ్లలో పెట్టుబడి పెడితే బాగుండుననే ఆలోచనలో వున్నాడు. మంచిరోజు చూసుకుని తను ఉద్యోగానికి వెళ్లే దారిలో వున్న ఓ ఫండ్ సంస్థ కార్యాలయానికి వెళ్లాడు. తీరా వెళ్లాక వాళ్లు చెప్పిన వివరాలు వినగానే సుబ్బారావుకు ఏమాత్రం అర్థం కాక పూర్తిగా అయోమయంలో పడిపోయాడు.



దాదాపు నలభైకిపైగా మ్యూచువల్ ఫండ్ కంపెనీలు ఇప్పటికే ఉన్నవాటికి తోడు రోజుకో కొత్త పథకంతో పెట్టుబడి దారులను ఆకర్షిస్తున్నాయి. అందులోనూ రకరకాల ఆప్షన్స్. ఏది ఎంచుకోవాలో తెలియని తికమకతో చాలామంది ఏకంగా పెట్టుబడులు పెట్టడానికే నిరాసక్తత చూపిస్తున్నారు. అయితే వీటిలో ఏది ఎంత లాభమో తెలుసుకుంటే ఎంచుకోవడమూ సులువవుతుంది. లాభాలు కలిసి వస్తాయి.

ఫండ్లలో పెట్టుబడి పెట్టాలనుకునేవారు ముందుగా దృష్టి పెట్టాల్సింది ఏ మ్యూచువల్ ఫండ్ కంపెనీ పని తీరు చరిత్ర, ఆర్థిక, నిర్వహణా సామర్థ్యం యాజమాన్యం, అది నిర్వహించే ఇతర ఫండ్లు ఆర్జించిన లాభనష్టాల ఆధారంగా ఓ నిర్ణయానికి రావాలి. ఆ తర్వాత వంతు మనది. మన అవసరం ఎలాంటిది? మార్కెట్ ఆటుపోట్లను తట్టుకునే ఆర్థిక సామర్థ్యం వుందా? పన్ను మినహాయింపులు మొదలైనవి కూడా పరిగణనలోకి



తీసుకోవాలి. అప్పుడు ఈక్విటీ, బ్యాలెన్స్‌డ్, డెట్ ఫండ్లలో ఏదో ఒకటి ఎంచుకోవచ్చు. కథ ఇక్కడితో అయిపోలేదు సుమా ఏ ఆప్షన్ను ఎంచుకోవాలో నిర్ణయించుకునే ముందు కూడా కొన్ని అంశాలు గమనించాలి. వాటి గురించి తెలుసుకుందాం.

**ఆప్షన్స్‌లో రకాలు**

ఈక్విటీ ఫండ్ – డివిడెండ్ ఆప్షన్. షేర్లలో పెట్టుబడి పెట్టే ఫండ్ గడించిన లాభాలను ఎప్పటికప్పుడు మనకు అందించే రకం ఇది. ఇక్కడ గుర్తుపెట్టుకోవాల్సిన విషయం ఏమిటంటే... డివిడెండ్‌ను ఎన్ఏవీ ఆధారంగా ప్రకటించరు. యూనిట్ ముఖ విలువపై మాత్రమే ప్రకటిస్తారు. డివిడెండ్ ఇచ్చిన ప్రతిసారీ ఆ పథకం ఎన్ఏవీ అంత మేరకు తగ్గుతుంది.

**ఉదా :**

మీరు ఒక ఫండ్ యూనిట్లు ఎన్ఎఫ్ఓలో కొన్నారనుకుందాం. దాని ముఖ విలువ రూ. 10. ప్రస్తుతం దాని ఎన్ఏవీ రూ. 12. ఆ ఫండ్ పది శాతం డివిడెండ్ ప్రకటిస్తే... మీకు యూనిట్‌కు ఒక రూపాయి వస్తుంది. అదే సమయంలో మీ ఫండ్ ఎన్ఏవీ రూ. 11 అవుతుంది.

**గ్రోత్ ఆప్షన్**

ఈ ఆప్షన్‌లో డివిడెండ్ ఇవ్వరు. లాభాల్లో మీకు వచ్చిన భాగాన్ని మళ్లీ పెట్టుబడి పెడతారు. కాబట్టి గ్రోత్ ఆప్షన్ ఎన్ఏవీ ఎక్కువ. ఈ రెండే కాకుండా కొన్ని పథకాలు డివిడెండ్ రీ ఇన్వెస్ట్‌మెంట్ ఆప్షన్‌ని కూడా అందిస్తున్నాయి.

**డివిడెండ్ రీ ఇన్వెస్ట్‌మెంటు ఆప్షన్**

ఈ విధానంలో డివిడెండ్ ప్రకటిస్తారు. కానీ, ఆ మొత్తాన్ని పెట్టుబడి దారులకు ఇవ్వరు. ఆ మొత్తానికి సమానమైన విలువగల యూనిట్లు కేటాయిస్తారు. ఈ ఆప్షన్‌లో కూడా డివిడెండ్ చెల్లించిన మేరకు యూనిట్ ఎన్ఏవీ తగ్గుతుంది. కానీ మీ యూనిట్ల సంఖ్య మాత్రం పెరుగుతుంది.

**డివిడెండ్ ఆప్షన్ లాభాలు**

- ఎప్పటికప్పుడు మీ పెట్టుబడిపై లాభాలు మీకు అందుతాయి. పైగా వచ్చిన ఈ డివిడెండ్‌పై ఎలాంటి పన్నూ వుండదు. కాబట్టి, చిన్న చిన్న అవసరాలకు యూనిట్లు అమ్మకుండా వుండవచ్చు.

- ఏడాదిలోపున డివిడెండ్ వచ్చినా పన్ను కట్టక్కర్లేదు. ఇది కేవలం డివిడెండ్‌కు మాత్రమే పరిమితం. ఏడాదిలోగా యూనిట్లు అమ్మితే మాత్రం పన్ను చెల్లించాల్సి వుంటుంది.
- ఈక్విటీ మార్కెట్ ఆటుపోట్లకు నిలయం పెట్టిన పెట్టుబడికి ఎంతో కొంత లాభాలు స్వీకరించి మార్కెట్లో కొనసాగాలనుకునే వారికి ఈ రకం ఎంతో అనుకూలం.

గ్రోత్ ఫలాలివీ

- ఫండ్ ఆర్జించిన లాభాల్ని తిరిగి పెట్టుబడి పెడతారు. కాబట్టి డివిడెండ్ ప్రసక్తి వుండదు. పైగా ఎన్ఏవీ కూడా ఎక్కువగానే వుంటుంది.
- షేర్లయినా, ఈక్విటీ ఫండ్లలో పెట్టుబడి పెట్టే మ్యూచువల్ ఫండ్లయినా పెట్టుబడులు ఎంత దీర్ఘకాలం కొనసాగిస్తే... అంత మంచిదన్న సంగతి మర్చిపోకూడదు. ఇలా దీర్ఘకాలం పెట్టుబడి పెట్టే అవకాశం కల్పిస్తుంది గ్రోత్ ఆప్షన్.
- ఏడాది తరువాత యూనిట్లు అమ్మితే పన్ను వుండదు. అంతకు ముందు అమ్మితే మాత్రం మూల ధన లాభంపై పన్ను చెల్లించాల్సిందే.
- ఈక్విటీ మార్కెట్లో పెట్టుబడులు కాబట్టి మార్కెట్ హెచ్చుతగ్గుల ప్రభావం తీవ్రంగా వుంటుంది.
- కొంతమంది మార్కెట్ పడిపోతున్న సమయంలో యూనిట్లు అమ్మేస్తుంటారు. ఆ తర్వాత మార్కెట్ ఏ మాత్రం నష్టపోయినా... తమ నిర్ణయం సరైనదే అని సమర్థించుకుంటారు. నష్టాల్లో అమ్ముకున్న కొన్ని రోజులకే ఎన్ఏవీ బాగా పెరిగితే చింతించి ఏం లాభం. ముందే అనుకున్నట్లు దీర్ఘకాలం అనేది మన పెట్టుబడుల లక్ష్యం కావాలి.
- ఏ మాత్రం నష్ట భయం ఉండకూడదనుకునే వారికి వున్న మరో ప్రత్యామ్నాయం డెట్ ఫండ్లు, బాండ్లలో మదుపు చేసే ఫండ్‌లు ఇవి.

షేర్లు లేకున్నా అమ్మేయొచ్చు

అన్నివర్గాల మదుపర్లు స్టాక్ మార్కెట్‌లో 'షార్ట్ సెల్లింగ్' చేసేందుకు అనుమతించాలని సెబీ నిర్ణయించినట్లు వచ్చిన వార్తలు మార్కెట్‌లో పెద్ద సంచనాలన్నే



సృష్టించాయి. దీనిపై నిపుణులు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నారు. మార్కెట్ హెచ్చుతగ్గులను కట్టడి చేస్తుందని కొంత మంది అంటూంటే... ఉద్దేశపూర్వకంగా స్టాక్‌మార్కెట్‌ను కూలదోయడానికి ఇది సహకరిస్తుందని మరి కొందరు అంటున్నారు.

రాబోయే రోజుల్లో దీని ప్రభావం ఎటూ కళ్లజూడబోతాం. ఈ నేపథ్యంలో అసలు షార్ట్ సెల్లింగ్ అంటే ఏమిటి? దీన్ని ఎలా ఆచరిస్తారు? అనే ప్రశ్నలకు మార్కెట్ పండితులకు కొత్త కాకపోవచ్చుగాని... ఇటీవలి కాలంలో ట్రేడింగ్‌లోకి అడుగుపెట్టిన మదుపర్లు తెలుసుకోవాల్సిన విషయమే... దీన్ని వివరించే ప్రయత్నం చేస్తున్నది. అలా ఎలాగో పరిశీలిద్దాం.

సర్వ సాధారణంగా చాలామంది మదుపర్లు షార్ట్ సెల్లింగ్ అంటే ఏమిటో తెలీక తికమక పడుతూ వుంటారు. కాని ఇదేమంత గందరగోళమైన విషయం కాదు. సాధారణంగా షేర్లు ఎందుకు కొంటాం. మంచి లాభాలు వచ్చాక అమ్ముకుందామనే కదా! ఉదాహరణకు ఒక కంపెనీ షేరును రూ. 50 పెట్టి కొన్నాం. అది రెండు నెలల తరువాత రూ. 90 అయిందనుకుందాం. ఆ తరుణంలో విక్రయిస్తే అదనంగా వచ్చే రూ. 40 లాభమన్న మాట. షార్ట్ సెల్లింగ్ దీనికి పూర్తిగా వ్యతిరేకం.

అదెలాగో తెలుసుకుందాం

ఒక షేరు ధర ప్రస్తుతం రూ. 50 వుంది. రాబోయే రోజుల్లో ఇది రూ. 30కి పడిపోయే అవకాశాలు వున్నట్లు సూచనలు కానవస్తున్నాయి. అలాంటప్పుడు చేతిలో షేర్లు లేకున్నా, ముందస్తుగానే బయటపడటంతో అక్కరకొచ్చేదే షార్ట్ సెల్లింగ్. నిర్వచనం రూపంలో చెప్పాలంటే షేర్లు లేకుండానే షేర్లు అమ్మడమన్నమాట. ప్రస్తుతం మన స్టాక్ మార్కెట్లలో టీ..ప్లస్.. వన్ సెటిల్‌మెంట్ పద్ధతి అమలవుతోంది. దీని ప్రకారం నగదు విభాగంలో షార్ట్ సెల్లింగ్‌కు పెద్దగా అవకాశం వుండదు. ఫ్యూచర్స్ అండ్ ఆప్షన్స్ (ఎఫ్అండ్ఓ)లో దీని ప్రభావం బలంగా వుంటుంది. ప్రస్తుతం రిటెయిల్ మదుపర్లు సహా కొన్ని వర్గాల వారికే షార్ట్ సెల్లింగ్‌కు అవకాశం వుంది. దీన్ని అందరికీ వర్తింపజేయాలన్నది సెబీ నిర్ణయం. అమలు తేదీని ఇంకా వెల్లడించలేదు. షార్ట్ సెల్లింగ్‌ను అనుమతించే కంపెనీల షేర్ల జాబితానూ త్వరలో ప్రకటిస్తారు.

## కేపీ కుంభకోణం తర్వాత

షార్ట్ సెల్లింగ్ మన స్టాక్ మార్కెట్లకే ప్రత్యేకం కాదు ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో ఏళ్లుగా షార్ట్ సెల్లింగ్ అమల్లో వుంది. అంతెందుకు? మన దేశంలో 2001కి ముందు షార్ట్ సెల్లింగ్‌కు వీలుండేది. కేపీ (కేతన్ పరేఖ్) కుంభకోణం బయటపడ్డాక సెబీ దీన్ని నిషేధించింది. ఆ తర్వాత ఇందులోని లొసుగులను తొలగించటానికి సెబీ శాయశక్తులా యత్నించింది. కట్టుదిట్టమైన నిఘా వ్యవస్థను ఏర్పాటు చేసింది. ఈ నేపధ్యంలో మళ్లీ ఇప్పుడు పూర్తి స్థాయిలో దీన్ని అమల్లోకి తేబోతున్నారు. అర్బిట్రేజ్ ట్రేడర్లకు షార్ట్ సెల్లింగ్ ఒక మంచి అవకాశం. ఎఫ్ అండ్ ఓ కంటే నగదు విభాగంలో ఒక కంపెనీ షేరు ధర అధికంగా వున్నప్పుడు ట్రేడర్లు నగదు విభాగంలో షార్ట్ సెల్లింగ్ చేసే అవకాశం వుంటుంది.

## మిగిలినదంతా ఆదాయం కాదు

ఎనభై శాతం డివిడెండ్... నూరు శాతం డివిడెండ్ అన్న ప్రకటనలో, పూరింపులో చూసి మ్యూచువల్ ఫండ్ పథకాన్ని ఎంచుకోకండి. ఆయా మ్యూచువల్ ఫండ్ కంపెనీల చరిత్ర దీర్ఘకాలంలో పథకాల పనితీరును మాత్రమే పరిగణనలోకి తీసుకోండి. అసలు డివిడెండ్ అంటే ఏమిటి? దాని గురించి వివరంగా తెలుసుకుందాం.

నేను మీ వద్ద పది వేలు అప్పు తీసుకున్నాననుకోండి. మీరు నాకు యీ రోజున పైకం యిచ్చారు. నేను మూడో రోజున మీకు రెండు వేలు తిరిగి యిచ్చేశాను. ఇక మీకు యివ్వవలసింది ఎనిమిదివేలు మాత్రమే. అంతేగానీ మీకు పదివేలకు 20 శాతం 2000రూ.లు ఆదాయం వచ్చిందని మీరు అనుకోరు కదా! మీరు యిచ్చిన పైకం మీకు తిరిగి యిచ్చాను. అది రాబడి అని అనుకోరు కదా!

ఒకవేళ మీకు 2000 యిచ్చినా కూడా యింకా మీకు పదివేలు యివ్వాలి అని నేనంటే అప్పుడు మీకు 20 శాతం రాబడి వచ్చినట్టు లెక్క అది పెట్టుబడిపై లాభం అన్నమాట.

ఇంత వివరంగా మీకు ఎందుకు చెబుతున్నానంటే మ్యూచువల్ ఫండ్స్ యూనిట్లు కొనే వాళ్లంతా ఇక్కడే పప్పులో కాలేస్తారు. మ్యూచువల్ ఫండ్‌ల ప్రకటించే డివిడెండ్లు ఎందరినో మభ్యపెడతాయి.



డివిడెండు అంటే అదేదో అదనపు ఆదాయమని అమ్ముకున్నప్పుడు వచ్చేదానికి ఇది కొసరని భ్రమపడుతూ వుంటాము. ట్యాక్స్ సేవింగ్ ఫండ్స్ విషయంలో ఈ ధోరణి ప్రబలంగా వుంది. ఇటీవల డివిడెండ్ల ప్రకటన జోరు బాగా పెరిగింది. యీ డివిడెండ్‌లను చూపించి పెద్దెత్తున పెట్టుబడులు సమీకరించటమే వీటి లక్ష్యం. డివిడెండ్ అనగానే అదేదో షేర్లపై వచ్చే డివిడెండ్ లాంటిదేనని అనుకుంటారు.

ఉదాహరణకు ఇన్ఫోసిస్ కంపెనీ వాటాదార్లకు డివిడెండు ప్రకటించిందని అనుకుందాం. ఇక్కడ కంపెనీ నుంచి సొమ్ము మీ జేబులోకి చేరుతుంది. కానీ మ్యూచువల్ ఫండ్ డివిడెండ్ అలాంటిది కాదు. మీకు రావాల్సిన సొమ్మునే డివిడెండ్ల రూపంలో అందిస్తాయి. డివిడెండ్ వల్ల కంపెనీకి ఖర్చేమీ వుండదు. మీకు కలిసొచ్చేదీ వుండదు. ఎందుకంటే డివిడెండ్ తర్వాత మ్యూచువల్ ఫండ్‌లు ఎన్.ఏ.వి. ఆ మేరకు తగ్గిపోతుంది. హెచ్.డి.ఎఫ్.సి. ఫండ్ గ్రోత్ ఆప్షన్‌నే తీసుకుందాం. యీ ఫండు ఎన్.ఏ.వి. రూ. 165.79 అదే డివిడెండ్ ఆప్షన్ ఎన్.ఏ.వి. రూ. 38.25 మాత్రమే. ఫండ్ ఒక్కటే కాని రెండు ఆప్షన్ల మధ్య అంతరం ఒకో యూనిట్‌కీ రూ. 127.54 ఇందుకు కారణం. గ్రోత్ ఆప్షన్ డివిడెండ్ల రూపంలో ఏమీ చెల్లించదు. పేరుకు తగ్గట్టుగానే ఫండ్ ఆర్జించిన లాభం ఎప్పటికప్పుడు డివిడెండ్ ఆప్షన్ ద్వారా మీకు అందుతుంది. అందుకే రెంటి మధ్య ఇంత తేడా.

## మీ సొమ్మే మీ చేతికి

డివిడెండ్‌ను ఎరవేసి పెట్టుబడులను ఆకర్షించే ధోరణి ట్యాక్స్ సేవింగ్ ఫండ్స్ విషయంలో బాగా ముదిరింది. ఉదాహరణకు ఒక ఫండ్ ఎన్.ఏ.వి. రూ. 100 వుందని అనుకుందాం. త్వరలోనే భారీ డివిడెండ్ ప్రకటించబోతున్నాం అంటూ డిస్ట్రిబ్యూటర్లకు మ్యూచువల్ ఫండ్ ఉప్పందిస్తుంది. ఇలా ఎందుకన్నానంటే –

రికార్డు తేదీకి అయిదు రోజులకంటే ముందుగా డివిడెండ్ల గురించి ప్రసార మాధ్యమాల్లో ప్రకటించకూడదన్నది సెబీ నిబంధన. వెంటనే డిస్ట్రిబ్యూటర్లు ఇన్వెస్టర్లకు సమాచారం అందిస్తారు. ఫలానా ఫండ్లు 250 శాతం అంటే పాతిక రూపాయల డివిడెండ్ ప్రకటించిందంటారు. కొద్ది రోజుల్లోనే 25 శాతం రాబడిని ఊరిస్తారు. డివిడెండ్లపై పన్ను వుండదు. కాబట్టి దాన్ని కూడా పరిగణనలోకి తీసుకుంటే మరో 30

శాతం వరకూ రాబడి అని లెక్కలు చెబుతారు. రూ. 25 డివిడెండు అందుకున్న వెంటనే మీరు కొన్న ఫండ్ ఎన్.ఏ.వి. రూ. 75కి పడిపోతుంది. 30 శాతం పన్ను రాయితీ అన్నది ఒక్క సంవత్సరానికి కాదు. మూడేళ్లకు. ఎందుకంటే ట్యాక్స్ సేవింగ్ ఫండ్స్‌లో సొమ్మును కనీసం మూడేళ్లు అట్టిపెట్టాలి. అంటే ఏడాదికి పది శాతం అన్నమాట. ఫండ్‌ల ద్వారా ఏ రూపంలో వచ్చేది అయినా మూల ధన లాభం గానే పరిగణించాలి. కావాలంటే చూడండి.

మీకు కొంత సొమ్ము అవసరమై యూనిట్లు అమ్ముకున్నారనుకోండి. ఇలా వచ్చేదేమో మూల ధనలాభం. అదే ఫండ్ కొంత సొమ్ము యిచ్చిందనుకోండి. అదేమో డివిడెండుట. ఏ రూపంలో వచ్చినా సొమ్ము మీదే. కానీ వర్తించే నిబంధనలను ఎలా దుర్వినియోగం చేస్తున్నారో తెలిసిన తర్వాత కూడానా? అధికారులు – సంస్థ అధిపతులు తెలుసుకోవాలి.



# స్టాక్ మార్కెట్‌పై నిపుణుల విశ్లేషణ

- దేశీయ స్టాక్ మార్కెట్లలో భారీ పతనం ప్రధానంగా అంతర్జాతీయ పరిణామాల ప్రభావమే. మరీ ముఖ్యంగా అమెరికాలో బ్యాంకింగ్, ఆర్థిక సేవల రంగాల్లో చోటు చేసుకున్న సంక్షోభం ఫలితమిది. 'ఫండమెంటల్స్' పరంగా చూసినప్పుడు ప్రస్తుతం స్టాక్ మార్కెట్ సూచీలు 'వాస్తవ విలువ'ను ప్రతిబింబిస్తున్నాయి.
- దేశీయ మార్కెట్లలో పతనం పరిపూర్ణం అయినట్టుగా కనుపించటం లేదు. సాంకేతిక విశ్లేషణ ప్రకారం చూస్తే మరో 1,000 పాయింట్ల మేరకు అయినా సూచీలు దిద్దుబాటయ్యే అవకాశం కనుపిస్తోంది. 13500–13800 కనీస స్థాయి అనుకోవచ్చు.
- మార్కెట్ ఏ దశలోనూ కోలుకునే అవకాశం లేకుండా రోజుకో చెడ్డ వార్త వస్తోంది. సోమవారం నాటి వంతు అమెరికాలో అయిదో అతి పెద్ద బ్యాంక్ అయిన బేర్ స్టెర్న్సది. దీంతో సెంటిమెంట్ బాగా దెబ్బతింది. దీని ప్రభావంతో దేశీయంగా బ్యాంకులు, ఆర్థిక సేవల రంగాల్లోని షేర్లు డౌన్ గ్రేడ్ అవుతున్నాయి. అందుకే ఐసిఐసిఐ బ్యాంక్ హెచ్.డి.ఎఫ్.సి. ఇండియా ఇన్ఫోలైన్ తదితర షేర్లు బాగా పడిపోయాయి.
- ప్రస్తుతం మార్కెట్‌ను భయం, గిరాకీ – సరఫరా నడిపిస్తున్నాయి. అమెరికాలో కష్టాల్లో వున్న పలు ప్రముఖ ఆర్థిక సంస్థలు మన దేశంలోని వాటికి వున్న ఈక్విటీ షేర్లను విక్రయిస్తూ వుండటంతో మార్కెట్లో సరఫరా పెరిగిపోతుంది. అదే సమయంలో కొనుగోలు దార్లు కరువయ్యారు.
- వాస్తవ విలువను తాజా సూచీలు ప్రతిబింబిస్తున్నాయి. 2007-2008 – 2008-2009 లకు కార్పొరేట్ల ఆదాయాలను పరిగణనలోకి తీసుకుంటే 14800 పాయింట్లు సరైన స్థాయని చెప్పవచ్చు.
- ఈ పరిస్థితుల్లో తొందరపడి షేర్లు కొనక్కర్లేదు. స్వల్పకాలానికి తక్కువలో కొనుగోలు చేసి, ఎక్కువ ధరలో షేర్లు విక్రయించటం కంటే వున్న షేర్లనే

ఎక్కువ ధరలో విక్రయించి తక్కువ ధరలో కొనుగోలు చేయటం శ్రేయస్కరం. రిలీఫ్ ర్యాలీలను ఇందుకు అవకాశంగా వినియోగించుకోవాలి.

- ఇప్పటివరకూ మార్కెట్‌లో లేకుండా కొత్తగా ప్రవేశించాలని ఎదురు చూస్తున్న మదుపుదార్లకు ఇది మంచి అవకాశమే. అయితే వెంటనే మొత్తం సొమ్ము పెట్టి షేర్లు కొనుగోలు చేయకుండా ఎంపిక చేసుకున్న షేర్లను పదిశాతం, పదిహేను శాతం చొప్పున కొనుగోలు చేస్తూ పోవచ్చు. ఏడాది, రెండేళ్ల దీర్ఘకాలిక దృక్పథంతో మార్కెట్లో పెట్టుబడి పెట్టవచ్చు.
- ప్రస్తుత భారీ పతనం నుంచి స్టాక్ మార్కెట్ మళ్లీ వెంటనే కోలుకొని తెగ పెరుగుతుందని ఆశపడటం అత్యాశే. మళ్లీ ఎప్పటికో.. అంటే ఏడాది ఏడాదిన్నర కాలానికి గానీ పెరిగే అవకాశం లేదని అనిపిస్తోంది.
- 2004-2006 సంవత్సరాల్లో స్టాక్‌మార్కెట్ సూచీలు 32 శాతం వరకూ 'దిద్దుబాటు'నకు గురై మళ్లీ నెమ్మదిగా కోలుకున్నాయి. గత నెలన్నర రోజులుగా చోటు చేసుకున్న దిద్దుబాటు 30 శాతం వరకూ వుంది. కాబట్టి దీనికి కాస్త అటూ ఇటూగా మార్కెట్లు స్థిరపడాలి.
- స్టాక్ మార్కెట్ కనీస స్థాయి అనేది ఎక్కడో తెలియనంతగా రోజురోజుకూ పతనమవుతూ ఉండటంతో మదుపుదార్లు దిక్కుతోచని స్థితిని ఎదుర్కొంటున్నారు. కాస్తో కూస్తో షేర్లు కొనగలిగిన స్థితిలో వున్న మదుపర్లు కూడా ఎందుకైనా మంచిది. మరికొంత కాలం ఎదురు చూద్దాం. అనుకునే స్థితి వుంది. ఈ నేపథ్యంలో మంచి విలువగల షేర్లను రెండు మూడేళ్ల దీర్ఘకాలిక దృష్టిలో కొనుగోలు చేయవచ్చు. సెంటిమెంట్‌బాగా దెబ్బతిన్న ప్రస్తుత పరిస్థితుల్లో స్వల్పకాలానికి మార్కెట్‌పై ఆశలు పెట్టుకోవడం అనవసరం. పరిస్థితులు సద్దుమణిగి మళ్లీ ఆశావహమైన స్థితి రావడానికి అందరూ ఊహించే దానికంటే ఎక్కువ కాలమే పట్టవచ్చు. కనీస స్థాయి అంటే ఎంతో ఇప్పుడే చెప్పలేని స్థితిలో మార్కెట్ వుంది. సమీప కాలంలో కంపెనీల ఆదాయాల, ఇతరత్రా అంశాలను బట్టి నిర్ధారించుకోవచ్చు. దేశీయంగా మన ఆర్థిక వ్యవస్థ కూడా ఆశించిన స్థాయిలో వృద్ధి రేటును నమోదు చేసే అవకాశం కనిపించటం లేదు.



- లెవరేజ్డ్ పొజిషన్లు (సామర్థ్యానికి మించి షేర్లు కొనుగోలు చేయడం) ప్రస్తుత పరిస్థితుల్లో ప్రమాదం మ. ుపుదార్లు ఎక్కువగా నష్టపోయేది కూడా వీటివల్లే. డెలివరీ ఆధారిత ఇన్వెస్టర్‌గా వున్న వారికి ఇప్పుడు కష్టకాలం ఎదురైనా మళ్లీ కొంతకాలానికి కోలుకునే అవకాశం వుంటుంది.
- మార్కెట్‌లో ఉండదలచినవారు కొత్తగా ప్రవేశించదలచినవారు రెండు మూడేళ్ల కాలం ఎదురు చూడగలిగితేనే రావాలి. అంతేగానీ స్వల్పకాలిక ప్రతిఫలం కోసం ఎదురు చూడటం అత్యాశే అవుతుంది.
- స్థిరమైన వృద్ధిని నమోదు చేయగలిగే కంపెనీలను గుర్తించి వాటిల్లో పెట్టుబడి పెట్టడం మదుపుదార్లకు శ్రేయస్కరం. మార్కెట్‌లో హెచ్చుతగ్గులు అననుకూల పరిస్థితులు ఉన్నప్పటికీ సరైన విలువను ప్రతిబింబించే కంపెనీలను వాటి భవిష్యత్తు ఆదాయాలకు అనుగుణంగా విలువకట్టి కొనుగోలు చేయవచ్చని నా అభిప్రాయం. టర్నోవర్ల కంటే ప్రధానంగా అధికంగా లాభాలు ఆర్జించే కంపెనీల వైపే మొగ్గు చూపాలి. ఉదాహరణకు బొగ్గు, స్టీలు, ఆయిల్‌ను అధికంగా వినియోగించే కంపెనీల టర్నోవర్లు పెరిగినప్పటికీ వాటి లాభాలు క్షీణించే అవకాశం వుంటుంది. ఎందుకంటే వీటి ధరలు తెగ పెరుగుతున్నాయి కాబట్టి.
- వ్యవసాయం, వ్యవసాయ అనుబంధ రంగాల్లోని కంపెనీలవైపు చూడటానికి ఇది అనువైన సమయం. ప్రపంచ వ్యాప్తంగా సరుకుల నిల్వలు తగ్గిపోతున్నాయి. ఏది ఎటుపోయినా ఆహారం ధాన్యాలు అయితే కావాలి కదా! అదే విధంగా చమురు - గ్యాస్ కూడా దీంతోపాటు విద్య, వైద్యం వినోదం, తదితర తప్పనిసరి రంగాల్లోని మంచి కంపెనీలను ఎంచుకుని పెట్టుబడి పెట్టే వ్యూహాలను అనుసరించవచ్చు. మార్కెట్ పరిస్థితులకు భిన్నంగా ఈ రంగాలు వ్యవహరించే అవకాశం వుంటుంది.

# పెట్టుబడి పెట్టేముందు ఒక చిన్న మాట

సాధారణ పరిస్థితుల్లో పెట్టుబడి పెట్టడం గురించి తీవ్రంగా పరిశీలించనేకూడదు. మరీ ముఖ్యంగా స్టాక్ మార్కెట్‌లో పెట్టుబడి పెట్టాలని అంతే కాదు. ఈ క్రింది మూడు అంశాల్లో కనీసం ఒక దానిని నెరవేర్చుకొంటే తప్ప పెట్టుబడుల సంగతి తలవనే వద్దు.

మొదటిది : కనిష్టంగా ఒక సంవత్సర ఆదాయాన్ని బ్యాంకులో జమచేసి ఉండటమో, లేదా నగదుగా మార్చుకోదగ్గ మరే ఇతర రూపాల్లోనైనా భద్రపరచినప్పుడో రెండోది : ప్రస్తుత ఆస్తులు ఇప్పటి మీ అప్పులతో పోల్చి చూస్తే రెండింతల కన్నా మించినప్పుడు మూడోది : మీకు వున్నట్టుండి గాలివాటంగా లేదా వారసత్వంగా సొమ్ము అందినప్పుడు దానిని మూలధనం (కేపిటల్)గా భావించాలి తప్ప ప్రస్తుత ఆదాయంగా తీసుకోకూడదు.

ఈ మూడు అంశాలను ప్రాతిపదికలుగా తీసుకుని వాటిని నెరవేర్చటం కోసం వేచి వుండాలి అంటే అప్పటికే ఎంతో జాప్యం జరిగిపోతుందని కొందరు పరిశీలకులు అంటారు. వారు చెప్పేది ఏమిటంటే పొదుపు కార్యక్రమాన్ని పెట్టుబడి పథకాలను సైదోడుగా మొదలుపెట్టేయమనే వారు ఈ రెంటినీ ఆధునిక ధన నిర్వహణ మెలకువల్లో భాగంగానే చూస్తారు. బహుశా ఇదే నిజం కూడా కావచ్చు. కానీ, వాస్తవికంగా చూస్తే అనేకమంది ప్రజలు తాము ఆర్థికంగా భద్రంగా వుంటేగాని పెట్టుబడులకు మానసికంగా సిద్ధం కారు. ఇక్కడ భద్రత అంటే బ్యాంకు ఖాతాలో వారి డబ్బు పోగుపడి ఉండటం.

**ఎంత సొమ్ము లేదా సొమ్ముగా మారగల సాధనాలు చేతిలో వుంచుకోవాలి?**

ఇంత మంచిది అని గిరి గీసి చెప్పటానికి లేదు. కానయితే మరీ ఎక్కువ నగదునుగాని, నగదుగా మార్చుకోదగ్గ సాధనాలు (మనీ మార్కెట్ మ్యూచువల్ ఫండ్‌లు, ట్రెజరీ బిల్లులు వంటివి) గానీ వున్నాయంటే దానిని మరింత లాభసాటి ఉపయోగంలోకి తీసుకెళ్లవచ్చు. మూడు నెలల ఖర్చులకు సరిపడా రొక్కాన్ని దగ్గరుంచుకోవాలి.





**నగదును, లేదా నగదుగా మార్చుకోదగ్గ సాధనాలను లాభసాటిగా ఉపయోగించుకొనేదెలా?**

బ్యాంక్ పాస్ బుక్ ఇచ్చే వడ్డీ కన్నా మించి ప్రతిఫలాన్ని అందించే అనేక మార్గాలను ఫైనాన్షియల్ మార్కెట్లు చూస్తున్నప్పటికీ పొదుపు ఖాతాల్లోనే నమ్మశక్యం కానంత డబ్బు వుండిపోతోంది. అది వడ్డీ రూపంలో ఆర్జించేది కనీస మొత్తమే. అలాంటప్పుడు అదే బ్యాంకులో మరింత అధిక రాబడులను సంపాదించుకోవడమూ సాధ్యమే. వీలయితే క్యాష్ సేవింగ్స్‌ను మనీ మార్కెట్ బ్యాంక్ ఖాతాలోనో, మనీ మార్కెట్ మ్యూచువల్ ఫండ్‌లోనూ జమ చేస్తే మార్కెట్ లెక్కల ప్రకారం వడ్డీ దక్కించుకోవచ్చు.

**అంత వేగంగా ఆస్తులు వృద్ధి చెందాలి అంటారా?**

తప్పనిసరిగా పొదుపు – పెట్టుబడి పథకాన్ని ఎంచుకుని సొమ్మును దాచి ప్రతి ఒక్కరూ తమను తాము కాపాడుకోవాలి. సిద్ధాంతపరంగా చెప్పాలంటే ఆస్తులు ఏడాదికి నికరంగా 10 శాతం చొప్పున పెరగాలి. ఖర్చులన్నీ పోను కనీసం 5 శాతం ఆదాయాన్ని దాయటం ఈ దిశగా వేయాల్సిన మొదటి అడుగు. వార్షిక ఆదాయాల్లో 5 శాతం పొదుపు చేయడానికి అలవాటు పడితే మంచిది.



పొదుపు చేయడానికి ఫలానా నియమాలు అంటూ ఏవైనా ఉన్నాయా అంటే లేవు సుమా. అది ఆయా వ్యక్తుల ఆదాయ పరిస్థితులపైన స్వభావంపైన ఊహించకనే మీదపడే ఖర్చులను అనుసరించి ఆధారపడి వుంటుంది. ఎంత దాయగలరన్నది సైతం వారి వయసు, కుటుంబ పరిస్థితులు, సాగే మార్గం వంటివి నిర్దేశించగలవు. కాలేజీ విద్య పూర్తి చేశాక

అయిదేళ్లపాటు విద్యాబుణాలు చెల్లు చేస్తూ ఉన్నారనుకోండి. మీ నికర విలువ వేగంగా పెరగకపోవచ్చు. అసలు ఎంత మాత్రం ఆ అవకాశం లేకపోవచ్చు. ఇల్లు కొనడం లేదా కొత్తగా కారు తీసుకోవడం లాంటివి చేశారనుకోండి. మీ ధన సమీకరణ సామర్థ్యం కుంచించుకుపోతుంది. ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే ఎంత పొదుపు చేస్తారనేదానికంటే ఎంత సంపాయిస్తున్నారన్నదానిపైన ఆధారపడుతుంది.

ఆర్జన అనేది జీవిత పర్యంతాన్ని బట్టి మారుతూ వుంటుంది. అయినప్పటికీ ఆర్థికంగా స్వస్థతతో వుండాలి అనుకుంటే క్రమం తప్పని పొదుపు అలవర్చుకోవడం ముఖ్యం. పొదుపు అనేది ఆరంభంలో మీ మొత్తం ఆస్తుల్లో ఒక భాగం అవుతుంది. కొన్నేళ్లు గడిచాక పొదుపు మొత్తాలపై వడ్డీ పెట్టుబడులపై ప్రతిఫలాలు కూడా ఆస్తిగా మారుతాయి.

ఏడాదికి 5 శాతం కన్నా తక్కువ కాకుండా పొదుపు రాశి పెరుగుతూ వుంటే, మీ ఆస్తులు ఎంత వేగంగా వృద్ధి చెందుతాయనే ప్రశ్న తల ఎత్తుతుంది కదూ! అది పొదుపు మొత్తాలు ఆర్జించే వడ్డీని అనుసరించి వుంటుంది. సంవత్సరానికి నికర విలువ పది శాతం వరకు పెరుగుతుందని అనుకోవచ్చు. కొత్త పొదుపు మొత్తాలపైన సగం శాతం అంతకు ముందటి పొదుపు రాశి మీద మిగతా సగం అన్నమాట.

(గెరాల్డ్ క్రిఫెజ్ రాసిన 'ద బేసిక్స్ ఆఫ్ ఇన్వెస్టింగ్' అనే పుస్తకంలోని ఒక అధ్యాయమిది)



# ఏ ఫండ్... ఎవరికి?

ఈక్విటీ, ఫిక్స్డ్ మ్యూచ్‌వల్ ఫండ్స్‌ల్లో పెట్టుబడులు పెట్టే విషయంలో చాలా మంది పెద్ద తప్పే చేస్తున్నారు. ఈక్విటీ ఫండ్స్‌ను ఈక్విటీ షేర్స్‌గానూ, ఫిక్స్డ్ ఇన్‌కమ్ ఫండ్స్‌ను ఫిక్స్డ్ ఆదాయం ఇచ్చే ఫండ్స్‌గాను పరిగణిస్తున్నారు. ఇది కరెక్టు కాదు. పైగా ఫిక్స్డ్ ఇన్‌కమ్ ఫండ్స్‌తో పోల్చుకుంటే పోస్టల్ సేవింగ్స్ మెరుగని చెప్పవచ్చు.

సరైన మ్యూచ్‌వల్ ఫండ్ పెట్టుబడుల ద్వారా ధనవంతులు కావడం సాధ్యమే. అయితే ఇక్కడ సరైన అనే పదాన్ని గమనించాలి. చాలామంది ఇన్వెస్టర్లు ఎలాంటి మ్యూచ్‌వల్ ఫండ్స్‌లో ఎలా పెట్టుబడులు పెట్టాలనే విషయంలో తప్పుల్లో కాలేస్తుంటారు. నా సుదీర్ఘకాల అనుభవంలో నేను గ్రహించాను.

**వ్యతిరేకంగా వ్యవహారం**

ఈ మధ్య ఐసీఐసీఐ చీఫ్ ఇన్వెస్ట్‌మెంట్ ఆఫీసర్ నీలేష్ షాతో మాట్లాడినపుడు ఈ విషయం ప్రముఖంగా ప్రస్తావనకు వచ్చింది. షా చెప్పిన దాని ప్రకారమైతే, చాలా మంది ఈక్విటీ ఫండ్స్‌ల్లో తరచుగా పెట్టుబడులు మారుస్తున్నారు. ఫిక్స్డ్ ఫండ్స్‌ల్లో మాత్రం పెట్టుబడులను దీర్ఘకాలంగా కొనసాగిస్తున్నారు. ఇదంతా చేయాల్సిన దానికి వ్యతిరేకమనే చెప్పొచ్చు.

సాధారణంగా చెయ్యాల్సిందేమంటే, వడ్డీరేట్లు మారినప్పుడల్లా వివిధ రకాలైన ఫిక్స్డ్ ఫండ్స్‌ల్లో పెట్టుబడులను మారుస్తూ ఉండాలి. కానీ అలా జరగడం లేదు. ఫిక్స్డ్ ఫండ్స్‌ల్లో పెట్టుబడులు - బ్యాంకు ఫిక్స్డ్ డిపాజిట్లు, పీపీఎఫ్, పోస్ట్ ఆఫీస్ డిపాజిట్లతో సరి సమానమని చాలామంది అనుకుంటారు. కొందరైతే వాటి కంటే ఎక్కువ రాబడులిస్తాయనీ అపోహ పడుతుంటారు. అందుకే పలువురు దీర్ఘకాలం పెట్టుబడుల కోసం ఫిక్స్డ్ మ్యూచ్‌వల్ ఫండ్స్‌ను ఎన్నుకుంటారు. వారికి తెలియని విషయం ఏమిటంటే, ఇలాంటి ఫండ్స్ ప్రొఫెషనల్స్ ఇన్వెస్టర్లకు సూట్ అవుతాయి. వీళ్లు స్వల్పకాలంగా పెట్టుబడులు పెట్టి లాభాలను ఆర్జిస్తారు. దీర్ఘకాలిక రాబడుల కోసం ఇలాంటి ఫండ్స్‌ల్లో వ్యక్తిగత లేదా చిన్న ఇన్వెస్టర్లు పెట్టుబడులు పెట్టడం సరికాదు. ఎందుకంటే ఈ ఫండ్స్ ఇచ్చే రాబడులు ఇతర పెట్టుబడుల కంటే కూడా ఎక్కువేమీ

కాదు. దీర్ఘకాలంలో ఈ ఫండ్స్ రాబడులను లెక్కిస్తే, వార్షికంగా 6 నుంచి 8.5 శాతం కంటే ఎక్కువ రాదు. బ్యాంక్ ఎఫ్‌డీలు, లేదా పోస్టాఫీస్ డిపాజిట్ కంటే ఈ రాబడి ఎక్కువ కాదు.

**పోస్టల్ సేవింగ్స్.. రత్నాలే...**

నిజం చెప్పాలంటే భారత పోస్టాఫీస్ సేవింగ్స్ పథకాల గురించి చాలామందికి పెద్దగా తెలియదు. వీటినెవరూ సరిగ్గా ఉపయోగించుకోవడం లేదు. చెప్పుకోదగ్గ రాబడులు, స్వయంఆ ప్రభుత్వమే గ్యారంటీ ఇవ్వడం, టీడీఎస్ డిడక్షన్ లేకపోవడం... ఇన్ని మంచి లక్షణాలతో ఇవి నిజంగా రత్నాలే. చాలా విషయాల్లో ఇవి ఫిక్స్‌డ్ ఇన్‌కమ్ ఫండ్స్ కంటే కూడా మెరుగేనని చెప్పవచ్చు.

**అదే మార్కెట్ టైమింగ్....**

ఇక ఈక్విటీ విషయాలను షేర్లుగా పరిగణించే విషయానికొస్తే, ఇన్వెస్టర్లు మామూలుగా షేర్లలో లావాదేవీలు జరిపినట్టుగానే ఎప్పుడంటే, అప్పుడు ఈక్విటీ ఫండ్స్‌లో పెట్టుబడులు పెడుతున్నారు. పెట్టుబడులను ఉపసంహరించుకుంటున్నారు. ఇది తర్కానికి విరుద్ధం. గడిచిన రెండేళ్లుగా చాలామంది ఈక్విటీ ఫండ్ ఇన్వెస్టర్లు ఈక్విటీ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేయడం ఆపివేశారు. 2008 ప్రారంభంలో మార్కెట్లు క్రాష్ అయినప్పటి నుంచి వాళ్లు ఈ నిర్ణయం తీసుకున్నారు. మార్కెట్ కొంచెం కోలుకోగానే ఇన్వెస్ట్ చేయడం ప్రారంభించారు. దీన్నే మార్కెట్ టైమింగ్ అంటారు.

**సింపుల్ వ్యూహం**

మార్కెట్ ఒడిదుడుకులను పట్టించుకోకుండా దీర్ఘకాలానికి ఈక్విటీ ఫండ్స్‌లో పెట్టుబడులు పెట్టడమనేది కామన్‌సెన్స్ అని చెప్పవచ్చు. ఇంకా చెప్పాలంటే మార్కెట్ పతనంలో ఉన్నప్పుడే సిప్‌ల ద్వారా పెట్టుబడులు పెట్టాలి. దీని ప్రయోజనాలు తర్వాత అందుతాయి. కానీ ఇన్వెస్టర్లు ఈ ఈక్విటీ ఫండ్స్‌ల్లో తరుచుగా పెట్టుబడులు పెడతారు, లేదా పెట్టుబడులు ఉపసంహరిస్తుంటారు. ఫలితంగా నామమాత్ర రాబడులు మాత్రమే పొందుతారు. పెట్టుబడి వ్యూహం సింపుల్‌గా ఉంటే, రాబడులు బాగా ఉంటాయనేది జగమెరిగిన సత్యం.



# ఫ్యామిలీ బడ్జెట్

మీరేం చేస్తుంటారు? ఆదాయమెంత?.... ఎక్కడ పెట్టుబడి పెడుతున్నారు, ఏఏ రకాలుగా పొదుపు చేస్తున్నారు?... మీరు అనుకున్న ఫలితాన్ని సాధించగలరా? ఇంకా బాగా ప్లానింగ్ చెయ్యాలంటే ఎలా? మీ ప్రస్తుత ప్లానింగ్ కరక్టేనా?

బాబోయ్! ఎన్ని ప్రశ్నలో! మీ ఫైనాన్షియల్ యాక్టివిటీ మీద మీ కెప్పుడూ ఇన్ని సందేహాలు కలిగి ఉండవు కదా! కానీ డబ్బుండీ! డబ్బు విషయంలో ఆ మాత్రం క్లారిటీ ఉండాలి. ఆ క్లారిటీ కావాలంటే చక్కని ఫైనాన్షియల్ ప్లానర్‌ను సంప్రతించాలి. అందరికీ అలా సంప్రతించటం, సలహా తీసుకోవటం కష్టం కనక... మీ వివరాలు తీసుకుని, మీకందిస్తున్న కేస్ స్టడీ ఇదిగో...

చక్రవర్తి అమెరికాలో ఉంటున్నా అతని ఇన్వెస్ట్‌మెంట్ విధానం సగటు భారతీయుడిలానే ఉంది. నేరుగా షేర్లలో ఎటువంటి ఇన్వెస్ట్‌మెంట్ లేకపోయినా సిస్టమాటిక్ ఇన్వెస్ట్‌మెంట్ విధానంలో ఇప్పటి వరకు మ్యూచువల్ ఫండ్స్‌లో 28 లక్షలు వరకు పెట్టుబడి పెట్టారు. అలాగే 15 లక్షల విలువైన డిపాజిట్లు, 9.5 లక్షల విలువైన క్యాపిటల్ గెయిన్ బాండ్స్ ఉన్నాయి. వీటిని అదనంగా... ఉద్యోగం పోతే అక్కరకు వచ్చేలా కంటింజెన్సీ ఫండ్ రూ. 10 లక్షలు సమకూర్చుకున్నాడు. సొంత ఇల్లు తప్ప రియల్ ఎస్టేట్ రంగంలో ఎటువంటి పెట్టుబడులూ లేవు. రూ. 60 లక్షల విలువైన టర్మ్ ఇన్సూరెన్స్‌తోపాటు, ఎల్ఐసీకి చెందిన 2 లక్షల విలువైన ఎండోమెంట్ పాలసీ, మూడు లక్షల విలువైన హోల్‌లైఫ్ పాలసీలున్నాయి. వీటికి కంపెనీ కల్పించే వైద్య బీమా, గ్రూపు ఇన్సూరెన్సులు అదనం. ఇవీ... స్థూలంగా చక్రవర్తి ఇన్వెస్ట్‌మెంట్స్.

చక్రవర్తి ఆర్థిక లక్ష్యాల విషయానికొస్తే చిన్న పిల్లలైన ఇద్దరికీ ఉన్నత చదువులకు రూ. 30 లక్షలు, పెళ్ళిళ్లకు మరో 35 లక్షలు అవసరమవుతాయని అంచనా. అలాగే రిటైర్మెంట్ తర్వాత కూడా విలాసవంతమైన జీవితాన్ని గడపడం కోసం రూ. 1.5 కోట్ల పెన్షన్ నిధిని ఏర్పాటు చేసుకోవాలన్నది అతని కోరిక.

మరి చక్రవర్తి ఇన్వెస్ట్‌మెంట్ విధానం సరైనదేనా? దీనితో అతను అనుకున్న భవిష్యత్తు ఆర్థిక లక్ష్యాలను చేరుకుంటాడా? దీనికి ఏమంటున్నారో చూద్దాం.

అజయ్...! మీ ఆర్థిక లక్ష్యాలపై మీకు స్పష్టత ఉంది. ద్రవ్యోల్బణాన్ని పరిగణనలోకి తీసుకొని లెక్క కట్టడం మీ దూర దృష్టిని తెలియచేస్తోంది. మీ పోర్ట్ ఫోలియోను పరిశీలిస్తే డెట్ ఆధారిత పథకాల్లో 43 శాతం, మ్యూచువల్ ఫండ్స్‌లో 30 శాతం ఇన్వెస్ట్ చేశారు. సొంత ఇంటికి ఇన్వెస్ట్ చేసిన మొత్తాన్ని కూడా పరిగణనలోకి తీసుకుంటే రియల్ ఎస్టేట్ రంగంలో 27 శాతం వరకు ఇన్వెస్ట్ చేశారు. మొత్తం మీద చూస్తే ఇప్పటివరకు మీరు రిస్క్‌కు అసలు సిద్ధపడలేదు. ఒక విధంగా మీకు అధికంగా ఇన్సూరెన్స్ ఉంది. అలాగే రాబడిని తక్కువ అందించే డెట్ పథకాలకు ఎక్కువ కేటాయించారు. చెల్లించాల్సిన పన్నులు ఇవన్నీ లెక్కిస్తే దీర్ఘకాలంలో బ్యాంకు డిపాజిట్లపై 6 శాతం నుంచి 7 శాతానికి మించి రాబడి వచ్చే అవకాశం లేదు. కాబట్టి ఇన్వెస్ట్‌మెంట్స్‌ను ఇదే విధంగా కొనసాగిస్తే మీ లక్ష్యాలను చేరుకోవడం కష్టమే. ఇకపై చేసే ఇన్వెస్ట్‌మెంట్స్‌లోనైనా మార్పులు చేయాలి.

**చేయాల్సింది ఇదీ..**

మీరు నిర్దేశించుకున్న లక్ష్యాలను చేరుకోవడానికి కనీసం పదేళ్లు పడుతుంది. రిటైర్మెంట్‌కు 16 సంవత్సరాలుంది. దానికి అనుగుణంగా ఇన్వెస్ట్‌మెంట్ చేయాలి. నేరుగా ఈక్విటీల్లో ఇన్వెస్ట్ చేయడంతో పాటు పెన్షన్ ఫండ్స్‌కు అధికంగా కేటాయింపులు చేయండి. ఈక్విటీ, డెట్ ఫండ్స్‌లో సమాన స్థాయిలో ఇన్వెస్ట్ చేసుకోండి. పిల్లల ఉన్నత చదువుల కోసం 11 నుంచి 13 సంవత్సరాలకు నగదు అవసరమవుతుంది. దీనికి అనుగుణంగా సాధారణ చిన్న పిల్లల బీమా పథకాలతో పాటు యులిప్ చిల్డ్రన్ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేసుకోండి. పెళ్ళిళ్ళకూ ఇలాగే చేయండి.

**సూచనలు:**

- వయసు దృష్ట్యా మీకు ఇంకా రిస్క్ చేసే సామర్థ్యం ఉంది కాబట్టి, ఈక్విటీల్లో ఇన్వెస్ట్‌మెంట్‌ను పెంచుకోండి.
  మ్యూచువల్ ఫండ్స్‌లో సిప్ విధానాన్ని కొనసాగించండి.
  కంపెనీ అందిస్తున్న వైద్య బీమాపై ఆధారపడొద్దు. సొంతంగా వైద్య బీమా తీసుకోండి. మారిన పరిస్థితుల్లో ఉద్యోగం ఎప్పుడెలా ఉంటుందో ఎవరికీ తెలియదు కదా...
- మీ ఇన్వెస్ట్‌మెంట్స్‌లో బంగారం ప్రస్తావన లేదు. మీ ఇన్వెస్ట్‌మెంట్స్‌లో 8 నుంచి 12% గోల్డ్ ఈటీఎఫ్‌లలో పెట్టండి.



# మదుపు చేసే అదను

షేర్ మార్కెట్‌లో మదుపు చేసిన డబ్బు భద్రంగా వుంటుందా? ఆశించిన లాభాలు తెస్తుందా? లాభాల మాట దేవుడెరుగు, కనీసం నష్టాలు లేకుండా బయటపడగలమా? ఇలాంటి సందేహాలతో డోలాయమానస్థితిలో ఇన్వెస్టర్లు కొట్టుమిట్టాడుతున్నారు. ఇటీవలి కాలాన సెన్సెక్స్ హెచ్చుతగ్గులు గమనిస్తే షేర్ల కొనుగోలుకు జంకే పరిస్థితి ఏర్పడింది. స్టాక్‌మార్కెట్ సెంటిమెంటు ఆధారంగా ఒడిదుడుకులకు లోనవ్వడం సహజమే. అయితే ఇప్పటి పరిణామాలు భిన్నంగా వున్నాయి. ఈ కారణంగానే స్టాక్‌మార్కెట్‌లో మదుపు చేసేవారు ఆలోచిస్తున్నారు. తమ షేర్లని అమ్ముకుంటున్నారు. కొత్తగా షేర్లు కొనడానికి వెనుకాడుతున్నారు. స్టాక్‌మార్కెట్ వ్యవహారాల్లో అనుభవం వున్నవారు మాత్రం కాస్త నిదానం పాటిస్తున్నారు.

**ఎందుకీ పరిస్థితి ఏర్పడింది?**

వేల మైళ్ల దూరంలోని ఒక దేశానికి జలుబు చేస్తే ఇక్కడ మనకు న్యూమోనియా వస్తుందనే మాట నిజమేనని స్టాక్‌మార్కెట్ పరిణామాలు తేటతెల్లం చేస్తున్నాయి. అమెరికన్ సబ్‌ప్రైమ్ సంక్షోభం తాకిడికి ఆ దేశ ఆర్థిక వ్యవస్థనే కాదు ప్రపంచవ్యాప్తంగా వివిధ దేశాల ఆర్థిక వ్యవస్థలు, మార్కెట్లు కుదుపునకు లోనయ్యాయి. మన దేశంలోని స్టాక్‌మార్కెట్లు గత మూడు నెలల కాలంలో భారీ పతనాలు చవిచూశాయి. 2007 డిసెంబర్‌లో సంవత్సరాంత సమీక్షలు రాసిన ఆర్థిక నిపుణులు, షేర్‌మార్కెట్ పండితులు 2008 ఆఖరు నాటికి సెన్సెక్స్ పాతిక వేలకు దాటుతుందని అంచనా వేశారు. వీరి ఊహలకు తగ్గట్టుగానే 2008 సంవత్సరంలో జనవరి తొలివారం దాటగానే, అంటే జనవరి 8 తేదీ నాటికి సెన్సెక్స్ 20,873.3 చేరుకుంది. కానీ ఇదే జనవరి 22 నాటికి 16,730 పాయింట్లకు తగ్గిపోయింది. ఆ రోజు లావాదేవీలు ఆరంభమైన కొన్ని నిమిషాలలోనే మార్కెట్ 2200 పాయింట్లు పతనమైంది. ఫిబ్రవరి, మార్చిలలో రెండుసార్లు అత్యధికంగా పడిపోయింది. మార్చి 17న ఒకేసారి 951 పాయింట్లు పతనమై 15000 పాయింట్ల లోపుకు చేరుకుంది. సెన్సెక్స్ చివరి వారంలో తిరిగి పదహారువేల సంఖ్యని దాటింది. అయినప్పటికీ స్టాక్‌మార్కెట్ నిపుణులు ఈ ఒడిదుడుకులపై మిశ్రమ స్పందన

వ్యక్తం చేస్తున్నారు.

కొన్నేళ్ల కిందటి కన్నా ఇప్పుడు స్టాక్‌మార్కెట్‌లో షేర్లు కొనడం, అమ్మడం మధ్యతరగతి కుటుంబాల వారి సామాజిక హెూదాకు చిహ్నమైంది. నానాటికీ డీమ్యాట్ ఎకౌంట్లు తీసుకుంటున్న వారి సంఖ్య పెరుగుతోంది. 1992 నుంచి స్టాక్ మార్కెట్‌పై మధ్య తరగతికి ఆసక్తి పెరిగింది. కొత్త శతాబ్దంలో 2000 సంవత్సరం తర్వాత ఆన్‌లైన్ ట్రేడింగ్ ద్వారా షేర్ మార్కెట్‌లో మదుపు చేసేవారి సంఖ్య పెరుగుతూ వచ్చింది. దేశీయ మదుపుదారులే కాకుండా ప్రవాస భారతీయులు, విదేశీ సంస్థాగత మదుపరి సంస్థలు భారతీయ స్టాక్‌మార్కెట్ల విజృంభణకు దోహదం చేశాయి. ఈ కారణంగా 2003 జనవరిలో 3000 పాయింట్ల వద్ద వున్న సెన్సెక్స్ 2008 జనవరి నాటికి 21,000 పాయింట్లను దాటింది. ఎవరూ ఊహించని రీతిలో రిలయన్స్ పవర్ పబ్లిక్ ఇష్యూకు ఆశించిన దానికన్నా 73 రెట్లు ఎక్కువగా నిధులు వచ్చిపడ్డాయి. దేశ ఆర్థిక వ్యవస్థపై, స్టాక్‌మార్కెట్ పురోగతిపై ఆశలు పెరిగాయి. అంతలోనే పరిస్థితి మారింది. మార్కెట్లో జోరుగా లావాదేవీలు జరుగుతాయనుకున్న వారి అంచనాలు తలకిందులయ్యాయి. ముఖ్యంగా అమెరికన్ సబ్‌ప్రైమ్ సంక్షోభం ఏసియన్ స్టాక్‌మార్కెట్లను కుదిపివేసింది.

**నిరాశ అక్కర్లేదు**

పరిస్థితులు ఇలా మలుపు తిరిగినా పూర్తిగా నిరాశ పడాల్సిన పరిస్థితి లేదు. మార్కెట్ మరోసారి ఒడిదుడుకులకు లోను కాదని చెప్పలేం గాని ఇక షేర్ల జోలికి వెళ్ళకూడదనే పరిస్థితి దాపురించదు. మధ్యతరగతిలో ఈక్విటీ మార్కెట్‌పైన, మ్యూచువల్ ఫండ్స్ పైన పెరిగిన ఆసక్తి నీరుగారిపోయే పరిస్థితులు ఏర్పడతాయనుకోవద్దు. దేశంలోని మ్యూచువల్ ఫండ్‌లలో దాదాపు రెండు కోట్ల అరవై లక్షలమంది మదుపరులు సభ్యులుగా వున్నారు ఈక్విటీ మార్కెట్‌లోని ఒడిదుడుకులు మదుపరులు దృష్టిని మ్యూచువల్ ఫండ్స్ వైపు మళ్ళిస్తున్నాయి.

షేర్‌మార్కెట్‌లోని పరిస్థితుల్ని చూశాక బంగారం కొనుగోలు మీద చాలామంది దృష్టి సారించారు. రియల్ ఎస్టేట్‌వైపు చూస్తున్నారు. బంగారం కొనుగోలు చేయాల్సిందిగా కొందరు నిపుణులు సూచిస్తున్నారు. బంగారం ధర పదిహేను వేల రూపాయలు దాటే అవకాశముంది. ఈ అంచనాలు నిజమవుతాయి కాస్త ఆలస్యంగానైనా. అయితే పొదుపు



సొమ్మును లేదా, మదుపు చేయాలనుకుంటున్న మొత్తాన్ని బంగారం కొనుగోలుకే వెచ్చించడం సరయింది కాదు.

**మదుపు భిన్నరకాలు**

ఇప్పుడు వున్న పరిస్థితులలో షేర్లు కొనేవారు జాగ్రత్తగా వ్యవహరించాలి. కొన్ని కంపెనీల షేర్ల ధరలు వున్నట్టుండి పడిపోవడం, మళ్ళీ అంతలోనే కోలుకోవడం చూస్తున్నాం. అయితే జాతీయంగా, అంతర్జాతీయంగా వున్న ఆర్థిక, రాజకీయ పరిణామాల్ని దృష్టిలో వుంచుకోవాలి. ఏ కంపెనీల షేర్లు కొనాలన్నా దానిపై హేతుబద్ధమైన అంచనా వుండాలి. సెన్సెక్స్ తక్కువగా వున్న కాలం షేర్లు కొనేవారికి మంచి కాలంగా చెబుతారు. అయితే కొన్నిరకాల షేర్ల ధరలు బాగా తగ్గాయని కొనుగోలు చేస్తే, అవి ఇంకా తగ్గుముఖం పట్టవనే గ్యారంటీ వున్నదా? అందుకని మీరు ఏ కంపెనీలో షేర్లు కొనాలనుకుంటున్నారో దాని పరిస్థితి పరిశీలించండి. దాని భవిష్యత్ ఎలా వుంటుందో గమనించండి. ఆ కంపెనీ గత చరిత్ర, దాని షేర్ తాలూకు ఎగుడుదిగుళ్ళు ఎలా వున్నాయో తెలుసుకోవాలి. అంతే తప్ప ఫలానా కంపెనీ షేర్ కొంటే ఫరవాలేదనే నిర్ణయానికి త్వరపడి రాకండి. కంపెనీ తీరుతెన్నుల్ని జాగ్రత్తగా గమనించాలి. అంతేగాక మిడ్‌క్యాప్ లో క్యాప్ షేర్ల ధరలు తీవ్రంగా తగ్గుముఖం పట్టాయి. ఇవి ఆకస్మికంగా పెరిగే అవకాశం లేదు. అందువల్ల ఈ రకమైన షేర్లని కొంటే చిక్కుల్లో పడతారని గుర్తుంచుకోవాలి.

పటిష్టమైన సంస్థలు కూడా సంక్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కొంటున్న సందర్భమిది. అమెరికాలో సిటీగ్రూపు బ్యాంకులు ఇందుకు దాఖలా. ఇప్పుడు ఆ గ్రూపు పరిస్థితి డోలాయమానంలో పడింది. మన కళ్ళ ముందు ఇవాళ బాగానే వున్నా కంపెనీ రేపటికి ఏమవుతుందో చెప్పడానికి వీల్లేదు. అమెరికాలో బర్న్‌స్టెర్న్స్ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకు దివాళా తీసిన తీరే ఇందుకు ఉదాహరణ. అమెరికాలోని ప్రముఖ బ్యాంకుల్లో ఇదొకటి. అయితేనేం ఈ బ్యాంకు షేర్ కొన్నవారు తీవ్రంగా నష్టపోయారు. మార్కెట్ అస్థిరంగా వున్నప్పుడు మదుపు చేసేవారు చాలా అప్రమత్తంగా వుండాలి. ముఖ్యంగా స్వల్పకాలంలో లాభపడాలని షేర్లు కొనేవారు నెమ్మదిస్తే మంచిది. దీర్ఘకాలానికి సరైన కంపెనీలలో మదుపు చేయడం ఉత్తమం. కొత్తగా ఆరంభమయ్యే కంపెనీలని జాగ్రత్తగా పరిశీలించండి. మీ పెట్టుబడి మొత్తాన్ని షేర్లలోనే గాక వివిధ రూపాల్లో మదుపు చేయాలి. ఇప్పుడున్న

పరిస్థితులకు అనుగుణంగా మీ ఫోర్టుపోలియోని మార్చుకోవడానికి ప్రయత్నించండి. పుకార్లను నమ్మి కొనడం, అమ్మడం చేయకూడదు. అలాగే ఆన్‌లైన్ సలహాలకు దూరంగా ఉండాలి. వాటిని పరిశీలించడంలో తప్పులేదుగానీ వాటినే విశ్వసిస్తే నష్టపోతారు. అంతేగాక ఇప్పుడు మార్కెటింగ్ మందకొడిగా వుందని షేర్లు కొనడానికి అప్పులు చేయడం అసలే తగదు.

మీ దగ్గర వున్న డబ్బు మొత్తాన్ని కొంత షేర్లకు, మరికొంత మ్యూచువల్ ఫండ్స్‌కు, బంగారానికీ కేటాయించండి. ముఖ్యంగా దీర్ఘకాలికమైన దృష్టితో షేర్లు కొనేట్టయితే ఈ పరిస్థితిని చూసి బెంగపడక్కర్లేదని స్టాక్‌మార్కెట్ నిపుణులు చెబుతున్నారు. ఇప్పుడున్న పరిస్థితులలో షేర్లు కొనదలచుకోకపోతే బ్యాంకు ఫిక్సెడ్ డిపాజిట్లలో పెట్టుబడి పెట్టడం ఉత్తమం. రిస్కు తీసుకోవాల్సి వస్తుందని జంకేవారికి ఇలాంటి పథకాలే శరణ్యం.

ఆర్థికాభివృద్ధి రేటు స్టాక్‌మార్కెట్‌పై ప్రభావం చూపుతుంది. వృద్ధి రేటు తొమ్మిది శాతం వుంటుందని ఆర్థికమంత్రి అంచనా వేశారు. దీనిని లక్ష్యంగా నిర్ణయించారు. ఇది అత్యాశేనని ఎం.ఎస్. స్వామినాథన్ వంటి ఆర్థికవేత్తలు చెబుతున్నారు. వృద్ధి రేటు ఏడు లేదా ఎనిమిది శాతంగా నిర్ణయించుకోవడం వాస్తవికంగా వుంటుందని సలహా ఇస్తున్నారు. బహుశా ఇదే వాస్తవమయ్యే అవకాశం వుంది. అంతర్జాతీయంగా ఆర్థిక వ్యవస్థలు, మార్కెట్లు అస్థిరత్వానికి లోనవుతున్నప్పుడు వృద్ధిరేటుని అతిగా అంచనా వేయడం సరికాదు. లక్ష్యాలు భారీగా వుండటంలో తప్పులేదు, కానీ వాస్తవాల్ని చేసేవారు ఈ సంగతి గుర్తుంచుకోవడం తప్పనిసరి. దీనిని దృష్టిలో వుంచుకొని వేగంగా అమ్ముడయ్యే వినియోగ వస్తువులు తయారు చేసే కంపెనీలు, ఫార్మస్యూటికల్స్, పవర్ ట్రాన్స్‌మిషన్, పబ్లిక్ సెక్టార్ బ్యాంకులు, ఆయిల్ రిఫైనరీ వంటి రంగాలలో మదుపు చేయడం లాభదాయకంగా వుంటుంది. ఆర్థిక వ్యవస్థ ఒడిదుడుకులకు లోనైనా ఈ రంగాల్లో పురోగతి వుంటుంది. అందువల్ల ఈ కంపెనీల షేర్లు కోలుకోలేనంతగా పతనమయ్యే అవకాశం లేదు.

**ఐపిఓలకు కాస్త దూరం**

రిలయన్స్ పవర్ ఇష్యూకి అనూహ్యమైన ఆదరణ లభించడంతో అనేకరకాల కంపెనీలు పబ్లిక్ ఇష్యూతో మార్కెట్లోకి వస్తున్నాయి. కొన్ని కంపెనీల ధరలు ఇష్యూ చేసినప్పటి ధర కన్నా తక్కువ పలికాయి. మదుపుదార్లు పెరిగినందున పబ్లిక్ ఇష్యూకు



ముందుకు వస్తున్నాయి అనేక కంపెనీలు. వాటి ప్రొఫైల్ గమనించకుండా మదుపు చేస్తే ఇన్వెస్టర్లు భారీగా నష్టపోతారు. ఈ కారణంగా ఐపిఓల విషయంలో జాగ్రత్త వహించాలి.

ముఖ్యంగా మదుపుదార్లకు దురాశ పనికిరాదు. దురాశ దుఃఖానికి చేటు అవుతుంది. రిలయన్స్ పవర్ మీద అనేక ఆశలు పెంచుకున్నందునే ఇన్వెస్టర్లు ఆ కంపెనీ ఆశించినదాని కన్నా మించి డబ్బు సమకూర్చిపెట్టారు. కానీ మార్కెట్‌లోకి వచ్చాక అసలు ధర కన్నా తక్కువ పలికింది. ఆ కంపెనీ మీద విశ్వసనీయత ఇన్వెస్టర్లని అటువైపు పురిగొల్పింది. ఈ విశ్వసనీయత ఒక్కటే చాలదు, ఆర్థిక రంగంతో ముడిపడిన అంతర్జాతీయ అంశాలు, మార్కెట్ సెంటిమెంటు, ఫండమెంటల్స్, స్పెక్యులేషన్ నిశితంగా గమనించాలి. ఇవేమీ లేకపోతే మార్కెట్లోకి వచ్చే ఐపిఓల జోలికి వెళ్ళకపోవడమే ఉత్తమం.

**ఈక్విటీలకు దూరంగా వుండాలా?**

జీవితంలో చలనశీలత వుంటుంది. ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా జీవితం తన దారిన తను ప్రయాణిస్తుంది. మనిషి జీవనయానం ఆగదు. అలాగే ఒడిదుడుకులు, ఉత్థానపతనాలు మార్కెట్ గతిని నిలిపివేయవు. మార్కెట్ పురోగతిని అడ్డుకోవు. అందువల్ల ఇవాళ్టి పరిస్థితులకు జడిసి ఇక ఈక్విటీ మార్కెట్‌కు దూరంగా వుండటమే మేలని తలచడం భావ్యం కాదు. గాయపడ్డ మనిషి అలాగే వుండిపోడు, కోలుకొని మళ్ళీ మనుషుల్లో కలుస్తాడు. మార్కెట్ కూడా అంతే. లావాదేవీలు ఆగిపోవు. అసలు ఇంత నిరాశగా ఆలోచించాల్సినంతటి తీవ్రతలోకి మార్కెట్ వెళ్ళలేదు. 1992 నాటి పరిస్థితుల్ని కొందరు గుర్తుకు తెస్తున్నారు. కానీ ఆ పరిస్థితి పునరావృత్తమయ్యే అవకాశం లేదు. అందువల్ల ఇప్పుడున్న పరిస్థితుల్లో నెమ్మదిగా, తెలివిగా అడుగులు వేస్తూ మదుపు చేసేవారు రాణిస్తారు. తాత్కాలికమైన లాభాల కోసం కాకుండా దీర్ఘకాలిక ప్రయోజనాల్ని దృష్టిలో పెట్టుకొని మదుపు చేయాలి. ప్రమోటర్ల మాటలు నమ్మకుండా సొంత వివేచనని ఉపయోగించాలి. సెన్సెక్స్‌లో హెచ్చుతగ్గులు మరి కొన్ని నెలలపాటు వుండే అవకాశముంది. అందువల్ల ఉత్థానపతనాల గురించి బెంగపడకుండా తెలివిగా వ్యవహరించాలి. సంక్లిష్టమైన స్టాక్‌మార్కెట్ వ్యవహారసరళి గాంభీర్యాన్ని కాస్తంత చిరునవ్వుతో గమనించే స్థైర్యం ఒక్కటే మదుపుదార్లకు మేలు చేస్తుంది.

# ఎక్కడ మదుపు చేయాలి?

కొత్త ఏడాదిలో ఆరు నెలలు గడిచిపోయాయి. నూతన సంవత్సరం ఆరంభంలో వున్న ఆర్థిక పరిస్థితులు తలకిందులయ్యాయి. ద్రవ్యోల్బణం ఏడేళ్ళ నాటి గరిష్ట స్థాయికి చేరింది. జూన్ రెండో వారం నాటికి 8.75 శాతం వున్న ద్రవ్యోల్బణం పదిశాతానికి చేరే ప్రమాదం వుంది. చమురు ధరలు పెరగడం, ఇతర నిత్యావసరాల ధరలు పెరగడం కారణంగా ద్రవ్యోల్బణం హెచ్చింది. ధరల్ని అదుపు చేసే పరిస్థితి ఇప్పట్లో కనిపించటం లేదు. కనుక వీటి ప్రభావం షేర్ మార్కెట్ మీద వుంది. పెట్రోలు ధరలు పెరిగిన వెంటనే షేర్లధరలు పడిపోవడం గమనించాల్సిన అంశం. ఆర్థిక వ్యవస్థలోని ఒడిదుడుకులు మార్కెట్‌ను ప్రభావితం చేస్తున్నాయి. షేర్‌మార్కెట్‌లో ఒక శుభ సూచకమైన ఫలితం ఏమంటే – ప్రఖ్యాత మందుల కంపెనీ రాన్‌బాక్సీని జపాన్‌కు చెందిన దైచీ శాంక్యో కొనుగోలు చేయడం. దీనితో ఆ కంపెనీలోని షేర్లధరలు ఒక్కసారిగా పెరిగాయి. ఇప్పటికే రాన్‌బక్సీ షేర్లు కొన్న మదుపుదార్లు బాగానే లాభపడ్డారు. ఇదొక మినహాయింపు మాత్రమే కాగా, షేర్‌మార్కెట్‌లో అనిశ్చిత పరిస్థితులు కొనసాగుతూనే వున్నాయి. జూన్ మొదటి వారంలో 15 వేల పాయింట్ల స్థాయికి కిందికి దిగజారింది. కానీ రెండోవారం ఆఖరుకి, అంటే జూన్ 13 నాటికి సెన్సెక్స్ 15190 పాయింట్ల వద్ద నిలిచింది. జనవరి తొలివారంలో వున్న సెన్సెక్స్ స్థాయితో పోల్చుకుంటే నాడు షేర్ మార్కెట్‌లో కనిపించిన బూమ్ కనుమరుగయ్యింది. జనవరి 8న 20,873.3 పాయింట్ల వద్ద నిలిచిన సెన్సెక్స్ ఆ గరిష్టస్థాయిని ఇప్పట్లో చేరుకునే అవకాశాలు లేవు. మార్కెట్లో వున్న అస్థిరత ఇప్పట్లో తొలిగే సూచనలు కనిపించడం లేదు. కనుక షేర్‌మార్కెట్‌లో మదుపు చేసేవారు ఆచితూచి అడుగులేయాలి. ముఖ్యంగా స్వల్పకాలిక మదుపరులు సంయమనం పాటించాలి. ఏ షేర్ ధర ఎప్పుడు ఎలా మారుతుందో చెప్పే పరిస్థితి లేదు. ఫార్మా కంపెనీల షేర్లు ఒకింత బాగానే వున్నాయి. రాన్‌బాక్సీ కంపెనీని జపాన్ కంపెనీని కొనుగోలు చేసిన తర్వాత ఫార్మా కంపెనీల షేర్ల లావాదేవీల్లో మంచి కదలిక వచ్చింది. ఈ నేపథ్యంలో బ్లూచిప్ కంపెనీల్లో దీర్ఘకాలిక దృష్టితో షేర్లు కొనడం మంచిది. వీటిలోనూ తగిన వాటిని ఎంచుకోవడం అవసరం. ఆన్‌లైన్ నిపుణుల సలహాలు, అంచనాలు కూడా



తలకిందులవుతున్న సంక్షుభిత పరిస్థితుల్లో వున్నాం. ముఖ్యంగా ద్రవ్యోల్బణం తగ్గుముఖం పట్టే పరిస్థితి లేదు. ఇది రానున్న కాలంలో పదిశాతానికి చేరితే రూపాయి విలువ మరింత పడిపోతుంది. ఈ పరిస్థితుల్లో పొదుపు చేసే మార్గాల్ని మార్చుకోవాలి. అలాగే ఎక్కడ మదుపు చేయాలో గ్రహించాలి. వీటికి సంబంధించి స్పష్టమైన అవగాహన వుండాలి. సంప్రదాయిక పద్ధతుల్లో డబ్బును పొదుపు చేయడం వల్ల ఏమీ లాభం వుండదు. బ్యాంకులు ఫిక్సెడ్ డిపాజిట్ల మీద వడ్డీరేట్లు తగ్గించే సూచనలున్నాయి. కొన్ని బ్యాంకులు ఇప్పుడు ఇస్తున్న తొమ్మిది శాతం వడ్డీ కూడా పెరిగిన ద్రవ్యోల్బణం రేటుతో పోల్చుకుంటే మిగిలేదేం వుండదు. అందువల్ల బ్యాంకులో ఫిక్సెడ్ చేయడం వల్ల ఒరిగేదేం వుండదు. ఈ పరిస్థితులలో ఎక్కడ మదుపు చేయాలనే అంశంలో స్పష్టమైన అవగాహనతో వ్యవహరించాలి.

ప్రస్తుత పరిస్థితులలో అయిదు రకాలుగా మదుపు చేసే అవకాశం వుంది.

1. షేర్లు :

ద్రవ్యోల్బణం వున్న పరిస్థితులలోనూ కొన్ని షేర్ల ధరలు పెరిగాయి. స్థూలంగా లెక్కిస్తే గత మూడేళ్ళ కాలంలో ఏడాదికి పదిహేను శాతం లాభాలు ఇచ్చాయి. అయితే అన్ని షేర్ల నుంచి ఇలాంటి లాభాల గ్యారంటీ లేదు. కొన్ని రకాల షేర్ల ధరలు చూస్తుండగానే పడిపోతున్నాయి. అందువల్ల మార్కెట్‌ను అధ్యయనం చేసి తగిన షేర్లు కొనాలి. ప్రస్తుతానికయితే ఫార్మా షేర్లు బావున్నాయి. ముమ్ముందు కూడా వైద్య రంగానికి ప్రాధాన్యం వుంటుంది. కనుక ఈ రకమైన వాటిలో షేర్లు కొనడం ఉపయుక్తం. అలాగే నిర్మాణ రంగం. వీటికి సంబంధించిన షేర్లలో హెచ్చుతగ్గులున్నా పురోగామి రంగం ఇది. పవర్ ట్రాన్స్‌మిషన్ రంగం షేర్ల గురించి కూడా ఆలోచించవచ్చు. కానీ మార్కెట్‌ను అధ్యయనం చేయాలి. షేర్ల కదలికల్ని నిశితగా పరిశీలించాలి. అందుకని దీర్ఘకాలిక లాభాల్ని దృష్టిలో పెట్టుకొని ఈ షేర్లను కొనడం లాభదాయకం. కనుక షేర్ మార్కెట్ పట్ల అవగాహన వుండి, ఎప్పటికప్పుడు పరిస్థితుల్ని అధ్యయనం చేయగలవారు మాత్రమే ప్రస్తుతం షేర్‌మార్కెట్‌లో తగిన షేర్లను ఎంచుకొని కొనుగోలు చేయాలి. అయితే మీ దగ్గర వున్న డబ్బంతా షేర్లలోనే ఇన్వెస్ట్ చేయవద్దు. కొంత భాగం వేరే రూపాల్లో ఇన్వెస్ట్ చేయడం ఉత్తమం.

**2. మ్యూచువల్ ఫండ్స్ :**

ప్రస్తుత పరిస్థితుల్లో రిస్కు తీసుకోడానికి ఇష్టపడనివారు, స్పష్టమైన అవగాహనకు రాలేనివారు మ్యూచువల్ ఫండ్స్‌లో పెట్టుబడి పెట్టాలి. దీర్ఘకాలిక లాభాల్ని దృష్టిలో వుంచుకొని కొన్నిరకాల మ్యూచువల్ ఫండ్స్‌లో మదుపు చేయడం మంచిది. డైవర్సీ ఫైడ్ ఈక్విటీ మ్యూచువల్ ఫండ్స్‌లో మదుపు చేయడం తగిన మార్గం. రిలయన్స్, డిబిఎస్ చోళ, కొటక్, సుందరం బిఎన్‌పి, స్టాండర్డ్ చార్టర్డ్ ప్రీమియర్ వంటి కంపెనీల నుంచి మ్యూచువల్ ఫండ్స్‌లో కొంత మొత్తాన్ని ఇన్వెస్ట్ చేయాలి.

**3. బాండ్లు :**

ఆర్థిక వ్యవస్థలు ఒడిదుడుకులకు లోనయి వుండటం, ద్రవ్యోల్బణం పెరగడం... ఈ పరిస్థితులలో స్వల్పకాలిక బాండ్లు కొనుగోలు చేయడం ఉపయోగకరం. అందుకని వీటికోసం కొన్ని మొత్తాలు కేటాయించుకోవాలి. ఈక్విటీ మార్కెట్‌లో ఒడిదుడుకులు ఏర్పడితే నష్టపోతారు. కానీ ఇక్కడ నష్టపోయేదేం వుండదు. మీ డబ్బు భద్రంగా వుంటుంది. స్వల్పకాలిక డిపాజిట్లు, ఫండ్‌లలో మదుపు చేయడంలో ఎలాంటి రిస్కు వుండదు. అంతేగాక ఎక్కువ వడ్డీరేటు వస్తుందనుకున్న సందర్భాల్లో మీ మదుపు మొత్తాల్ని మార్చుకునే వీలు వుంటుంది. అందుకని అనువైన బాండ్లు కొనేవారు రాత్రిళ్ళు హాయిగా నిద్రపోవచ్చు.

**4. స్థిరాస్థులు :**

ఆర్థిక వ్యవస్థ ఎలాంటి ఆటుపోట్లకు లోనయినా నష్టపోకుండా వుండడమే కాదు, కాలం గడుస్తున్నకొద్దీ లాభపడటానికి అవకాశం వున్న రంగం ఏదైనా వుందంటే అది నిర్మాణ రంగం. రియల్ ఎస్టేట్‌లో నష్టాలు ఉండవు. కొన్నిసార్లు ధరలు తగ్గినట్టు కనిపించినా, కాలం గడుస్తున్న కొద్దీ పెరుగుతాయి. ఇప్పుడు హైదరాబాద్ పరిసరాల్లో గానీ, రాష్ట్రంలోని ఇతర ప్రధాన నగరాల్లో గానీ భూములు కొన్నవారు నష్టపోయే ఆస్కారం లేదు. మూడేళ్ళ కిందటి బూమ్ ఇప్పుడు కనిపించడం లేదని కొందరు చెబుతున్నారు. కానీ తిరిగి ఆ బూమ్ వచ్చే అవకాశాలు పుష్కలంగా కనిపిస్తున్నాయి. హైదరాబాద్‌లోనే కాదు, రాష్ట్రంలోని ప్రధాన నగరాలు, పట్టణాల్లో, వాటి పరిసరాల్లో ప్లాట్లు కొనుగోలు చేసేవారు రానున్న కాలంలో మరింత లాభపడతారు. ఇవాళ



శంషాబాద్‌లో గజం ధర లక్ష రూపాయలు. అయితే స్థిరాస్థి కొనుగోలుదారులు ఎక్కువ ధర పెట్టి కొనకుండా ఇప్పుడిప్పుడు అభివృద్ధిలోకి రానున్న ప్రాంతాల్లో ఇళ్ళ స్థలాల్ని కొనడం ఉపయుక్తం. ఉదాహరణకు హైదరాబాద్‌లో ఇప్పుడు దృష్టి అంతా శంషాబాద్, కొత్తూరుల వైపు వుంది. ఇక్కడితో పోలిస్తే హయత్‌నగర్, పెద్ద అంబర్‌పేట, బాట సింగారంల వైపు ఇళ్ళ స్థలాలు తక్కువ ధరలో లభిస్తాయి. కనుక స్థిరాస్థి కొనుగోలుదారులు ఇటువైపు ప్లాట్లు కొనుగోలు చేయడం వల్ల ముమ్ముందు లాభపడతారు. అయితే ఇప్పుడే కొని ఆర్నెల్ల తర్వాత వెంటనే ఎక్కువ రేటుకు అమ్మాలనుకోకూడదు. కనీసం రెండు మూడేళ్ళయినా ఆగాలి. ఇంకా ఎక్కువ కాలం ఆగితే మరింత లాభం.

**5. బంగారం :**

ద్రవ్యోల్బణం సకల రంగాల్ని ప్రభావితం చేస్తుంది. ఈ పరిస్థితులలో కొంత డబ్బును బంగారం మీద కూడా పెట్టుబడి పెట్టాలి. ఎందుకంటే మరేమి తగ్గినా బంగారం ధర తగ్గదు. నష్టపోయే అవకాశమే లేదు. ప్రస్తుతం బంగారం ధర 13000 రూపాయలు దాటింది. ముమ్ముందు ఈ రేటు పెరిగే అవకాశాలున్నాయి. కనుక స్వల్పకాలిక లాభాల్ని ఆశించకుండా దీర్ఘకాలం వేచి వుండేవారు బంగారం కొనుగోలు చేయడం కూడా లాభదాయకమే. అందుకని బంగారాన్ని పెట్టుబడిగా చూసేవారు నాణాల రూపంలో, బిస్కెట్ల రూపంలో బంగారం కొనాలి. అలాగే బంగారాన్ని ఇంట్లోనో, లాకర్లలోనో దాచకుండా ఇతర మార్గాల్లో సురక్షితంగా వుంచుకునే వీలుంది. గోల్డ్ డిపాజిట్ పథకాలు వున్నాయి. అలాగే గోల్డ్ ఎక్స్ఛేంజ్ ట్రేడెడ్ ఫండ్స్ కూడా వున్నాయి. లాభిస్తుంది.

ఈ విధంగా భిన్నమైన మార్గాల్లో మదుపు చేయడం వల్ల నష్టపోవడమనే పరిస్థితి వుండదు. లాభాల్లో హెచ్చుతగ్గులుంటాయే గానీ మదుపు చేసిన డబ్బుకు ధోకా వుండదు.

# దీర్ఘకాలిక మదుపరులకు ఇదే అదును



జీవితంలో మాదిరిగానే వాణిజ్యంలోనే ఒడిదుడుకులు వుంటాయి. వాటిని అధిగమిస్తూ ప్రయాణించడం అనివార్యం. స్టాక్‌మార్కెట్ సూచీలు పడిపోవడం, లేవడం, పడిపోవడం అనే తతంగం కొన్నాళ్ళుగా సాగుతోంది. స్టాక్‌మార్కెట్ నిపుణుల అంచనా ప్రకారం ఈ ఒడిదుడుకులు ఇలా కొంతకాలం కొనసాగుతుంటాయి. బేరిష్ ట్రెండ్ వున్నప్పటికీ కొందరు లాభపడుతున్నారు. ఫండమెంటల్స్, టెక్నిక్స్‌ను ఎప్పటికప్పుడు గమనిస్తూ షేర్లు ఎప్పుడు కొనాలో, ఎప్పుడు అమ్మాలో తెలిసినవారు డబ్బు చేసుకుంటూనే వున్నారు. అందుకే ఒడిదుడుకులు ఎలా వున్నా మార్కెట్‌లో షేర్ల అమ్మకాలు, కొనుగోళ్ళు సాగుతున్నాయి. మార్కెట్ కార్యకలాపాలు ఊహించినరీతిలో మందగించలేదు. దీనిని బట్టి అర్థం చేసుకోవాల్సిందేమంటే సెన్సెక్స్ పాయింట్లు తగ్గినా, పెరిగినా ఈ వ్యవస్థ కొనసాగుతుంటుంది. కనుక యుక్తిగా వ్యవహరించే మదుపరులకు షేర్లు కొనడానికి ఇది మంచి సమయం. ఇవాళ కొని, మరో వారం రోజులకో, నెలరోజులకో అమ్మి లాభాలు చేసుకోవాలనుకుంటే కుదరదు. దీర్ఘకాలం నిరీక్షించాలి.

**దీర్ఘకాలిక ప్రాతిపదికన కొనాలి?**

మార్కెట్ మహా ఉధృతిలో వుండి, సెన్సెక్స్ పైపైకి ఎగబాకుతూ వున్నప్పుడు మంచి కంపెనీల షేర్లు కావాలంటే ఎక్కువ ఖరీదుకి కొనుగోలు చేయాల్సి వస్తుంది. కానీ ఇప్పుడు మార్కెట్ బేరిస్ ట్రెండ్‌లో వుంది. కనుక చౌకలో మంచి కంపెనీల షేర్లు కొనాలనుకునేవారికి ఇది మంచి సమయం. అయితే షేర్లని దీర్ఘకాలిక ప్రాతిపదికన కొనాలి. కొన్న తర్వాత ఏడాది, రెండేళ్ళపాటు వేచి చూడాలి. ఇందుకు సిద్ధపడినవారే రంగంలోకి దిగడం మంచిది.

**ఎలాంటి కంపెనీల షేర్లు కొనాలి?**

షేర్ల ధరలు బాగా పడిపోయాయని ఏ కంపెనీ పడితే ఆ కంపెనీ షేర్ కొనకూడదు. తొలుత బ్లూచిప్ కంపెనీలకు ప్రాధాన్యం ఇవ్వాలి. ఫండమెంటల్స్ సరిగా వుండి, ఆర్డర్లు సరిగా వున్న కంపెనీల షేర్లు మాత్రమే కొనాలి. ఎందుకంటే ఇలాంటి కంపెనీల పురోగామి దిశలో వుంటాయి. మార్కెట్ పతనంలోనూ వాటి షేర్లకు ఢోకా వుండదు. అందుకే మార్కెట్ ఇండెక్స్‌ని చూడాలి. కొన్ని రోజుల పాటు వరుసగా పరిశీలించాలి. ఎవరో చెప్పారని కాకుండా మీరు స్వయంగా పరిశీలించి తగిన కంపెనీల షేర్లని కొనడం ఉత్తమం

**ఎలాంటి కంపెనీల్ని ఎంచుకోవాలి?**

మార్కెట్ ఒడిదుడుకులు ఎలా వున్నా, కొన్ని కంపెనీల షేర్లు తాత్కాలికంగా పడిపోయినట్టు కనిపించినా క్రమంగా పెరుగుతాయి. ఏయే రంగాలకు సంబంధించిన కంపెనీలు అభివృద్ధి దశలో వుంటాయో, నిరంతర కార్యకలాపాలు కొనసాగిస్తుంటాయో చూడాలి. ప్రస్తుతం వినియోగదారుల కంపెనీలు, ఇంజనీరింగ్ కంపెనీలు, క్యాపిటల్ గూడ్స్, ఆరోగ్య సేవల రంగం చక్కగా వున్నాయి. ఇలాంటి వాటికి చెందిన సరయిన కంపెనీ షేర్లని ఎంచుకోవాలి. మార్కెట్ ఆటుపోట్లతో సంబంధం లేకుండా భవిష్యత్తు బాగా వుంటుందనుకున్న కంపెనీల షేర్లు ఎంపిక చేసుకోవాలి.

**ఆరాటం వద్దు**

మార్కెట్ మందగమనంలో వుందని ఏ షేర్ పడితే ఆ షేర్ కొనకూడదు. ముఖ్యంగా కొత్తగా మార్కెట్లోకి ప్రవేశించేవారు జాగ్రత్తగా వ్యవహరించాలి. మిత్రులు చెప్పే మాటలు విన్నా, స్వయంగా పరిశీలించి వివేచనతో షేర్లను కొనుగోలు చేయాలి. మార్కెట్ పడిపోతుంది కాబట్టి షేర్లు కొనడానికి ఇది మంచి సమయమని కొందరు మిత్రులు త్వరపెడుతుంటారు. ఎలాంటి కంపెనీల షేర్లు కొంటే ఏ స్థాయిలో లాభాలు వస్తాయో మనకు అందమైన ఊహలు కల్పిస్తారు. అయితే కొన్ని సందర్భాల్లో లాభాలు తెచ్చిపెట్టే షేర్లు వెంటనే అందుబాటులో వుండవు. ఇలాంటప్పుడు తొందరపడి కొందరు ఏదో ఒక కంపెనీ షేర్ కొంటారు. అనవసరమైన ఆరాటమే దీనికి కారణం. ఇలా ఆరాటపడి కంపెనీ తీరుతెన్నుల్ని గమనించకుండా కొంటే భంగపడతారు.

### తక్కువ ధరకు లభించడమే ప్రమాణమా?

బేరిష్ మార్కెట్‌లో షేర్ల ధరలు అతి తక్కువగా వున్నాయని కొనడం ఆరంభిస్తే నష్టపోతారు. ఉదాహరణకు ఒక కంపెనీ షేర్ ధర యాభై రూపాయలే వుందని వెయ్యి షేర్లు కొంటారు. కానీ నెల తిరిగేసరికి అది ఇరవైకో, పాతికో పడిపోతే మదుపరులు నష్టపోతారు. అందుకని ధర తక్కువగా వుండటం ఒక్కటే ప్రమాణం కాదు. ఆ కంపెనీకి సంబంధించిన సకల అంశాలు బలంగా, సహేతుకంగా వుండాలి. కొన్ని వందల కంపెనీలు మార్కెట్లో వున్నాయి. ఒక దశలో కొన్ని కంపెనీల ట్రేడింగ్ వారాల పాటు నడవదు. కనుక తక్కువ ధరకు లభించినా, కంపెనీల ప్రొఫైల్ చూడాలి. ఏడాది తర్వాతయినా లాభదాయకంగా వుంటుందనుకునే కంపెనీ షేర్‌నే కొనాలి.

### దశలవారీగా మదుపు చేయాలి

ఉదాహరణకు స్టాక్‌మార్కెట్‌లో లక్ష రూపాయలు పెట్టుబడి పెట్టాలనుకుంటే ఆ మొత్తాన్ని ఒకేసారి మదుపు చేయకూడదు. ముందుగా ఇరవైవేలు పెట్టి కొన్ని కంపెనీల షేర్లు కొనాలి. ఆ తర్వాత పదిహేను రోజులకు మరో ఇరవై వేలు, ఇంకో పక్షం రోజుల తర్వాత మరో ఇరవై వేలు పెట్టుబడి పెట్టాలి. ఈ విధంగా నాలుగు లేదా అయిదు భాగాలుగా విభజించి దశలవారీగా మదుపు చేయడం సరయిన పద్ధతి. ఈ క్రమంలో మీరు మార్కెట్‌ని అధ్యయనం చేస్తారు. కంపెనీల తీరుతెన్నులు ఎలా వున్నాయో అర్ధమవుతాయి. దీనితో ఎక్కడ మదుపు చేస్తే ఉపయోగకరమో తెలుస్తుంది. దానిని బట్టి నిర్ణయాలు తీసుకోవడానికి వీలవుతుంది.

### వివిధ కంపెనీల్లో మదుపు

ఒకటీ రెండు రకాల కంపెనీల షేర్లను కొనుగోలు చేయగానే సరిపోదు. ఉదాహరణకు మీ దగ్గర వున్న లక్ష రూపాయలతో వివిధ కంపెనీల షేర్లను కొనడం ఉత్తమం. అందుకని మీ పోర్టుఫోలియో వైవిధ్యంతో వుండాలి. దీర్ఘకాలిక దృష్టితో పెట్టినప్పటికీ కేవలం ఒకే కంపెనీలో మదుపు చేయడం వల్ల అనర్థాలు ఏర్పడతాయి. ఒకవేళ ఆ కంపెనీ షేర్ అనుకోకుండా పడిపోతే మీరు నష్టపోవాల్సి వస్తుంది. అందువల్ల స్టాక్‌మార్కెట్‌లో పెట్టుబడి పెట్టాలనుకునే మొత్తాన్ని వివిధ కంపెనీల షేర్ల కొనుగోలుకు వెచ్చించాలి.



### మార్కెట్ క్రా. లో వున్నప్పుడు పాటించాల్సిన జాగ్రత్తలు

మార్కెట్ ఒడిదుడుకుల పట్ల సరయిన అవగాహన లేకపోతే షేర్ల లావాదేవీలలో నష్టపోతారు. చాలామంది సెన్సెక్స్ చూసి ఏ కంపెనీ షేర్ ధర ఎంత వున్నదో తెలుసుకుంటారు. కానీ ఒక కంపెనీ షేర్ ధరలో వచ్చే మార్పుల గురించి సీరియస్‌గా ఆలోచించరు. మార్కెట్ ధోరణిని అధ్యయనం చేయరు. ఇలాంటివారు నష్టపోకుండా వుండాలంటే మార్కెట్ క్రాష్‌లో వున్నప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

1. బూమ్ టైమ్‌లో కొన్న షేర్ల ధరలు తగ్గాయని, వాటిని అమ్మి చౌకలో వచ్చే వేరే కంపెనీల షేర్లు కొని లాభపడాలనుకుంటారు కొందరు. కానీ కంపెనీ భవిష్యత్తు బావుంటే దాని షేర్ తర్వాతయినా ఉపకరిస్తుంది.
2. ఏ టైప్ షేర్లని అమ్మి బి గ్రూపు, టి గ్రూపు షేర్‌ను కొనడం ప్రమాదకర క్రీడ. ఒక దశలో తగ్గిన 'ఏ' గ్రూపు షేర్ ధర తర్వాత కాలంలో పుంజుకుంటుంది. కానీ ఫండమెంటల్ సరిగా లేని కంపెనీ షేర్‌ధర తక్కువగా కొన్నా అది ఆ తర్వాత మరింత పడిపోతుంది. అందుకని ఇలాంటి ప్రయోగాలకు దూరంగా వుండాలి.
3. మార్కెట్ బూమ్‌లో వున్నప్పుడు సహజంగానే డివిడెండ్ ఎక్కువ వస్తుంది. కానీ మార్కెట్ సంక్షోభంలో వున్నా మంచి డివిడెండ్ ఇచ్చే కంపెనీలు కొన్ని వుంటాయి. కనుక ఇలాంటి వాటి షేర్లు కొనుగోలు చేయడం ఉత్తమం.
4. బేర్ మార్కెట్‌లో ఏ గ్రూపు షేర్లకు బదులుగా బి గ్రూపు కంపెనీల షేర్లు కొనకూడదు. ఎందుకంటే మార్కెట్ మందకొడిగా వుంటే బి గ్రూపు షేర్ల కదలిక తక్కువగా వుంటుంది. అందువల్ల తొందరపడవద్దు.
5. ప్రస్తుత పరిస్థితులలో మీ పోర్టుఫోలియోలో రిలయన్స్, జిఎంఆర్, డిఎల్ఎఫ్ లాంటి బ్లూచిప్ కంపెనీలు, ఎన్‌టిపిసి, ఎల్ఐసి హౌసింగ్ ఫైనాన్స్ వంటి మిడ్‌కాప్ కంపెనీలు వుండాలి. అలాగే కొన్ని లాభదాయకమైన చిన్నతరహా కంపెనీలు వుండాలి. ఆయా కంపెనీల తీరునీ, మార్కెట్‌నీ అధ్యయనం చేయాలి.
6. మార్కెట్ ఒడిదుడుకుల నేపథ్యంలో బుల్‌మార్కెట్‌లో షేర్లని అమ్మాలనీ, బేర్ మార్కెట్‌లో కొనాలన్న సూత్రాన్ని పాటించండి.

ముమ్ముందు మార్కెట్ స్థితిగతులు ఎలా వుంటాయన్న అంశం పట్ల కూడా సాధారణమైన అవగాహన అవసరం. జాగ్రత్తగా మదుపు చేసినా మార్కెట్ సరళిని ఎప్పటికప్పుడు గమనిస్తుండాలి. అయితే ఎప్పుడూ అదే ధ్యాసత వుండటం అనవసరం. ముఖ్యంగా ఇతర ఉద్యోగాలు, వ్యాపారాలు నిర్వహించేవారు షేర్‌మార్కెట్‌లో వచ్చే లాభాల్ని దృష్టిలో వుంచుకొని మదుపు చేయాలనుకుంటారు. వీరిలో తెలివిగా ఆలోచించడం కన్నా ఎక్కువగా ఆరాటపడుతుంటారు. కానీ కూల్‌గా వుండి పరిస్థితుల్ని మదింపు చేసే ధోరణి అవసరం.

**అత్యాశ తగదు**

ఉత్థానపతనాలు చవిచూస్తున్న స్టాక్ మార్కెట్‌లోనూ ఇప్పటికీ లాభాలు గడించే ట్రేడర్లు వున్నారు. మామూలు పెట్టుబడులు పెట్టి లాభాల కోసం అత్యాశతో ఎదురు చూసేవారు ట్రేడర్లు కారు. మార్కెట్ ఒడిదుడుకులు ఎలా వున్నా దాని ప్రయాణం కొనసాగుతుంటుంది. అందుకని పత్రికల్లో వచ్చే వార్తల్ని బట్టిగాక ఒక కంపెనీ పురోగతిని జాగ్రత్తగా గమనిస్తూ, ఆపరేటర్ల కార్యకలాపాల్ని ఒక కంట కనిపెడుతూ, ఏ రోజు ఏ షేర్ ధర ఎలా మలుపు తిరుగుతున్నదో గమనిస్తూ సమయానుకూలంగా స్పందించేవారు ట్రేడర్లు అవుతారు. ఇంత తీరిక, ఓపిక లేనివారు తెలివిగా లాభాలు అందించే కంపెనీల షేర్లని దీర్ఘకాలిక ప్రాతిపదికన కొనుగోలు చేయాలి. మదుపరులుగానే వుండాలి. ఆశకి పోయి దురాశకి లోను కాకూడదు.

**మ్యూచువల్ ఫండ్స్‌లోనూ మదుపు**

మీరు మదుపు చేయాలనుకుంటున్న మొత్తంలో కొంత భాగాన్ని మ్యూచువల్ ఫండ్స్‌కు కూడా కేటాయించుకోండి. భారీగా నష్టపోకుండా వుండడానికి, ఒకమేరకు ఆదాయం రావడానికి ఇలాంటి మదుపు ఉపకరిస్తుంది. స్టాక్‌మార్కెట్ ఆటుపోట్లను ఎదుర్కొంటున్న ప్రస్తుత పరిస్థితులలో ఇలాంటి మదుపు మార్గాలు అన్ని విధాలుగా ఉపకరిస్తాయి.